శ్రీ రామాయనమః

# రుక్మాంగద చరిత్రము

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

వాసుదాస స్వామి



శ్రీ రామచంద్రాయనమః

ఆర్యచరిత్ర రత్నావళి

# రుక్మాంగద చరిత్రము

శ్రీమంద్రావాల్మీకి,వాసుదాసు
వావిలికొలను సుబ్బరాయ విరిచితము



## ఆంధ్రవాల్మీకివాసుదాసస్వామి

శ్రీరామసేవాకుటీరము,ఒంటిమిట్ట కడప.

## శ్రీరామాయనమః

## ఆర్యచరిత్ర రత్నావళి

# రుక్మాంగద చరిత్రము

శ్రీమంతం బైనవిదిశాపురమును సూర్యవంశపురాజగు రుక్మాంగదుఁడు పాలించు చుండెను. ఈయన రూపమున మన్మథుని, ధైర్యమునమేరువును,దానమునశిబిచక్రవర్తి కర్ణదధీచులను బోలి ధర్మము తప్పక రాజ్యముచేయుచుండెను. ఆయునపాలనమందుఁదల్లిదండ్రులయాజ్ఞమీఱు పుత్రులును,భర్తయాజ్ఞ మీఱుసతులును,వేళగానివేళ తినువారును, అతిభుక్కులును, కుక్షులనే దేవతలుగా జేసికొని యే కసుమాలమైన భోజ్యా భోజ్యవిచారములేక కుడుచువారును, కులధర్మములను ఆశ్రమ ధర్మములను మీఱివర్తించువారును, ఋతుకాలమునతిక్రమించిభార్యల గలయువారును, అనాచారులును,దురాచారులును, జారులు,చోరులు, బుత్రశోక మనుభవించువారును,వైధవ్యదుఖములకుఁ బాలుపడినవారును,జిత్రేంద్రియులుగానివారును, దేవతలకు నతిథులకు నభ్యాగతులకుఁ బెట్టక భుజించు వారును,బంక్తిభేదముచేయువారును, అసూయాపరు లును, మందున కైనలేరు. అందఱుసదాచారసంపన్నులగుటచే రోగములులేవు. వైద్యశాలలు లేవు. అధర్మవర్తనలు లేకుండటచే దండాధికారులులేరు. కారాగృహాములులేవు. ప్రజలందఱు తన ప్రజలని రాజు భావించుటచే నరిభయములు రాజద్రోహములు లేవు. ప్రజలందువిశ్వాసములేక వారిని దోఁచి తినుచుఁ బక్షపాతబుదులైపీడిం చు కుక్షింభరులు రాజులైనఁ గదా యాదోషములు పుట్టును. ఇట్లు ధర్మము నాలుగు పాదముల నడుచునట్లు ధరయేలుచుండి యారా జొకనాఁడునిండుసభఁ బేరోలగమున్న సమయమున శుకశౌనకాది మహర్షులు విచ్చేసిరి. రుక్మాంగదుఁడు వారిని సమ్మానించి యర్ఘ్యాసనాసీనులంజేసి పెన్నిధిగన్న పేదచందంబున సంతసించిపుణ్యకథా ప్రసంగంబు చేయునెడ రాజు వారినిజూచి సవినయ ముగ నిట్లనియె.

"మహాత్ములారా! మీరాకవలననాజన్మముకడతేఱెనునాగృహము పావనమయ్యెను. సమస్తతీర్థము లుసేవించినఫలము లభించెను. మీయట్టిమహానుభావులు మాయట్టియజ్ఞుల నధములను దరింపఁ జేయు నభిప్రాయమునఁ దప్ప నేల వత్తురు ? మీ యట్టి వారిదర్శనమును భగవద్దర్శనమును శ్రేయస్సు నొసఁగక యూరక పోవునా? దీర్ఘకాలముగ నన్నొకసందేహము బాధించుచున్నది. శాస్త్రములందుఁ బురాణాములందు నెన్నియోయైహికాముష్మికఫలముల నొసఁగు వ్రతములు చెప్పఁబడియున్నవి. ప్రతివ్రతవిషయము చెప్పునప్పుడు వ్రతములందెల్లనునదేయుత్తమవ్రత మని చెప్పబడుచుండును. సహినిందాన్యాయముచేనిట్లు పెద్దలు చెప్పిరని యెఱుఁగుదును. వ్రతములన్నియు నైచ్ఛికములనియు నాచరించిన ఫలమొసఁగుననియు నాచరింపకున్నఁ బ్రత్యవాయము లేదనియు నెఱుఁగుదు. కొన్ని వ్రతములుకొందఱు మాత్రమే చేయఁదగినవిగా నున్నవి. నాసందేహమేమన వీరు వారనక యెల్లజాతులవారు నెల్లవయసులవారు బాలురు వృద్ధులు స్త్రీలు పురుషులు నందఱునాచరింపఁ దగినదియు నాచరింపకుండినఁ బ్రత్యవాయముగలదియు సకలమనోవాక్కాయ పాపములహరించునదియు నారోగ్యము సంపద నొసగుటేగాక నారాయణ ప్రీతికరమై మోక్ష మొసఁగునదియు నగు నుత్తమోత్తమవ్రతమానతిచ్చి నన్నుఁగృతార్థునిజేయుడు" అని ప్రార్థించెను.

అప్పుడామునిశ్రేష్ఠులందఱునాలోచించి యైకకంఠ్యముగ రాజుతో నిట్లుచెప్పిరి.

రాజేంద్రా ! నీవుశ్లాఘ్యతమమైన ప్రశ్నము గావించితివి. ఇదియే నీసదాచారసంపన్నుతను దైవభక్తిని దెలుపుచున్నది. కావున సర్వశాస్త్రపురాణేతిహాస మహాజనసమ్మతమై నీవడిగినగుణములు గల మహావ్రతమును జెప్పెదము వినుము.

సీ. అమిత పాపౌఘ వంశాలవీఘనదాహ
శిఖికీల యేకాదశీవ్రతంబు
దర్పితాహితదైత్య దళనో గ్రవిష్ణుకౌ
క్షేయకం బేకాదశీవ్రతంబు
కఠినపాతక నముత్కరభేకలోకభు
గ్జిహ్మగం బేకాదశీవ్రతంబు
సంసారసంతాపసంత ప్తమానసో
జ్జీవనం బేకాదశీవ్రతంబు

తే. సువ్రతాకల్ప మేకాదశీవ్రతంబు
చిరశుభాకార మేకాదశీవ్రతంబు
చిన్మయానంద మేకాదశీవ్రతంబు
శ్రీసమంత మేకాదశీవ్రతంబు.

సీ. పుణ్యభూములలోనఁ బురుషోత్తమమువోలె
గ్రహములలో దివాకరుడువోలె
అంభోనిధులలోన నమృతార్ణవమువోలె
నగములలో మేరునగమువోలె
ఆశ్రమంబులలోగృహస్థాశ్రమమువోలె
దరువులలోఁ గల్పతురువులోలె
అధికదానములలో నన్న దానమువోలె
మణులలోఁ గౌస్తుభమణియుఁ బోలె

తే. స్వర్గమున భూమియందు రసాతలమునఁ
బ్రతి యొనర్పఁగ రానిసువ్రతము సకల
మంగళాస్పద మఖిల సంపత్కారంబు
క్షితితలేశ్వర యేకాదశీవ్రతంబు.

నృపాలా ! యెవ రెంతపాపముచేసి యుండినను యథావిధి యే కాదశీవ్రతమాచరించువా రాపాపములవలన విడువఁబడి శ్రీమన్నారాయణుని కృపాకటాక్షముచేఁ బుణ్యలోకములఁ గాంతురు. తక్కినవ్రతములు నీవు చెప్పినట్టు చేసిన ఫలముగలదు గాని చేయకుండినఁ బాపములేదు. ఏకాదశీ వ్రతమట్టిది గాదు. చేసినవారికిఁ బుణ్యమెట్లు నిశ్చయముగఁగలుగునో చేయనివారికిఁ బాప మట్లు నిశ్చయముగఁ గలుగును.

అనిన రుక్మాంగదుఁ డామునీశ్వరులఁ జూచి యిట్లనియె. పవిత్రచరిత్రులారా ! యేకాదశీవ్రత మాచరించువిధి యెట్టిదో తెలుపుడు.

అనిన వారిట్లనిరి. భక్తాగ్రేసరా ! గంగచేనిండినఘటమున గల్లుపోసిన నదియెట్లు దూష్యమో యట్లే దశమి వృద్ధిఁగూడిన యేకాదశియు నయోగ్యము. కావున నానాఁ డుపవసించి వ్రతము చేయరాదు గయయందుఁబిండప్రదానము చేయుటచేఁ బితృఋణముతీఱును. రామసేతువు కాశీలోనగు పుణ్యక్షేత్రముల దర్శించినబ్రహ్మహత్యాది పాపములుపోవునుగాని దశమివృద్ధిగలసిన యేకాదశినాఁడు వ్రతముసలిపిన పాపమేమి చేసిననుబోదు. కావున శాస్త్రీయమైనపద్ధతి చెప్పెదను వినుము. దశమి విద్ధలేని యేకాదశి వ్రతమునకు యోగ్యము. ఆదినమునకుఁ బూర్వదినము దశమిని రాత్రియందు భోజనము చేయరాదు. పూలు చందనము తాంబూలము స్త్రీసంగమము వదలిపెట్టవలయును. ఏకాదశినాఁడుదయముననే లేచి స్నానముచేసి శుభ్రవస్త్రముల ధరించి యాహ్నికకృత్యములనుదీర్పవలయును. ఆనాడు సత్యవ్రతము నియతిగ జరపవలయును. క్రూర కార్యములను జేయరాదుయ తలఁపను రాదు. తాఁకరానిమనుష్యులఁ దాఁకరాదు. పాషండులతోడఁ బలుకరాదు. తాంబూలము, చందనము, పుష్పములు లోనగు భోగముల మానవలయును మనస్సున భగవంతుని స్మరించుచు ఒడవలయును. లేకనారాయణునికథలువినుటయందుఁబఠించుటయందుఁ గడపవలయును. తుచ్ఛవిషయముల మనస్సుపోనీయ రాదు. అహోరాత్రములుపవసింపవలయును. పగటఁగాని రాత్రిఁగానినిదురింపరాదు. రాత్రియం దు మేల్కనియు ఒడవలయును. ద్వాదశినాఁడుదయముననే స్నానాదికృత్యములెల్లఁదీర్చితనకుఁ గలవిధముగఁ బాకము చేయించి బ్రాహ్మణులనో యయిన వారినో భోజనమునకుఁ బిలిచి వారితోడ ద్వాదశి గడచుటకు ముహూర్తార్ధమునకు(౨౪ నిమిషములు) ముందే భుజింపవలయును. తినఁ గూడినవారుకూడ మాంసము క్షౌద్రశాకము వర్జింపవలయును. ద్వాదశినాఁడు పగట నిద్రింపరాదు. రాత్రి భుజింపరాదు. తాంబూలము భార్యాసంగమములోనైనవి వర్జింపవల యును. ఈవిధముగ నాలుగుపూఁటల భోజనము చాలింపశక్తిలేనివారు ఏకాదశినాఁడైన నిరుప్రొద్దు పస్తుండవల యును. అంతకు శక్తిచాలనిరోగులు వృద్ధులు బాలురు నొకపూట రాత్రి వేళనైన భోజనము చాలింపవలయును. అంతకుశక్తి లేనివారలఱకూడుపైనఁ దిని యుండవలయును. శక్తియుండియు కుక్షింభరులై తినెడు వారు ద్రోహులు. యథాశక్తియనునది బాలుర వృద్ధుల రోగుల విషయముననేకాని యితరులపట్లఁగాదు. ఉపవాసముండి కాలమును దుష్టముగఁ గడుపువారికి విశేషఫలము రాజాలదు. నిద్రాహారవిషయములలో శక్తి లేమి నియమమునకుఁగొంత లోపించినను అంత పాపము లేదు కాని స్త్రీసంగమము చేయుట మహాపాపము. ఆషాడమాసము భాద్రపదమాస ముకార్తీకము ఈనెలలయందలి శుక్లపక్షైకాదశుల యందు శుష్కోపవాసము చేయవలయును. బంగారు

దొంగిలించి నను,గోవును జంపినను, బ్రహ్మస్వ మపహరించినను,దేవాదాయధర్మాదా యములహరించినను, గల్లుద్రావినను,తుదకు బ్రహ్మహత్యచేసినను దేవతాప్రార్థనములు అన్నదానములు జపములు హోమములు గోదానములు కృఛ్రములు చాంద్రాయణములు లోనైనవి చేసి పాపనిర్ముక్తుండుగా వచ్చునుగాని హరివాసరమున శక్తిగలిగియును పవసింపక భుజించువానిపాప మేమిచేసియుఁ బోఁజాలదు. కుక్కమాంసముఁదినుపాపికైనను బ్రాయశ్చిత్తము గలదుగాని యేకాదశినాఁడుభుజించువానికిఁ బ్రాయశ్చిత్తము లేదు.

సీ. పతికార్య భారసంభ్రమవశంబున నైన
నాకలి లేకైన నరుచి నైన
భామినీవిరహసంప్రాప్తి నొందుట నైన
నశన మబ్బక యైన నలుక నైన
మృగయావినోదనిమిత్తములం దైన
వ్యసనంబునందైన వనట నైన
దారుణజ్వరపీడఁ దగులుట నైన సం
గర మొనర్చుట నైఁ గఱవునందు

తే. నైన హరివాసరమునాఁ డహర్నిశంబుఁ
జాలశుష్కోపవాసంబు సంభవించె
నేని నాపుణ్యునకుఁ గల్గు సిరి ద
నర్చు శ్రీహరి వై కుంఠనగరసుఖము.

కావున రాజా ! యేనిమిత్తముచేతనై నను హరివాసరమున నుపవసింపవలయు. అందు భక్తిచే నొనర్చు వారికి నధికఫలం బనిచెప్పవలయును. ఏకారణముచేఁ జేసినను ఫలము తదనుగుణముగలుగక మానదు.

రుక్మిణి-భక్తితోఁ జేసినఁ గదా ఫలము కలుగును ? అభావవిరక్తిచే జేసిన నెట్లు ఫలము గలుగును ?

తండ్రి-ఈకథయంతయు జెప్పినపిమ్మటనీ ప్రశ్నమునకు సమాధానముచెప్పెదను.

అమ్మణ్ణి-ఏకాదశినాఁడు ఫలహార మని యడుకులు ఉప్పుపిండి పేలపిండి యివన్ని తిందురే. వీరికి ఫలము కలదా లేదా ?

తండ్రి-ఫలాహారశబ్దమున కర్థము చెడినట్టు దేనికిని జెడలేదు. ఈవిషయమున మనవారితెలివి పండ్లు తినుట ఫలాహారము గాదని పిండివంటలు ఫలాహారమని చెప్పునట్టిస్థితికి వచ్చినది. నీవు చెప్పిన యడుకులు ఉప్పుపిండి మొదలైనవి తినుట ఫలహారము కానేరదు అవియన్నముకంటె గట్టియై సులభముగ జీర్ణముకాని పదార్థములు. ఏకాదశివ్రతము నుద్దేశమాహారమువర్జించుట అంతే కాని దినము తినుదానికంటె గట్టియాహారము కడుపునిండఁ దినుట కాదు. వాడుకగఁ దినునాహారమైనను మఱియేదైనను ఎంత తగ్గించిన నంతమేలు.

రుక్మిణి- ద్వాదశినాఁడు పెసరపప్పు ఉసిరికాయ అవిసెయాకు వాడుకొనెదరే యేల ?

తండ్రి-మనపెద్ద లెన్నెన్నివిషయములో యాలోచించి యాచారము లేర్పఱిచిరి. ఏకాదశినాఁడుపవసించుట చేత దేహమున వేఁడిమి యెక్కియుండును. ఆయుష్ణశాంతి కై యీపదార్థములు పాకము చేయఁబడును. ఈకారణ చేతనే ద్వాదశినాఁడు పాయసాన్నము జేయుదురు. ఇవన్నియు నావశ్యకములే. లేనియెడల దేహారోగ్యము చెడును. ఏకాదశి యుపవాసముంటిమని ద్వాదశి పారాణవేళ రెండుదినముల తిండి యొక నాఁడే తినరాదు. మితభుక్తియే కార్యము. అవిసెయాకు ద్వాదశినాఁడు ప్రశస్తికి వచ్చుటకు మాపెద్దవాండ్రొకకథచెప్పఁగా వింటిని. శ్రీరాముఁడు పట్టాభిషేకము చేసికొనిన తరువాత నొకయేకాదశివచ్చెను. ఆనాఁడాయన యావ్రతము చలిపి మఱునాఁటి పారణకువానరులనందఱకుభోజనమునకుఁబిలిచివారికందఱకుఁ బాయసాన్నముతానేవడ్డింప బూనుకొనెనఁట. కొందఱకువడ్డింపఁగా క్రోఁతులన్నియు వచ్చి ముసురుకొనెను. కోటానఁగోట్లుగ నుండువారికెల్లఁడాను వడ్డింపలేక యాపాయస పాత్రమును హనుమంతునిచేతి కిచ్చెఁనటఆయన వడ్డింపఁబూనుకొన్నను ద్రాగినక్రోఁతులే మరల మరలవచ్చి ముఖములుచూపక చేతులు చాఁచుచుఁ ద్రావ నారంభించెను. చేసిన పాయసము చాలకవచ్చు నట్లుండెను. అప్పుడాంజనేయుఁడవిసెవనములోనికిఁబోయి దానియాకుదూసిపరమాన్నములోఁ గలిపి యందఱకుఁ బోసెనట. రామస్వామిస్వయముగఁ జేయించి వడ్డించిన పరమాన్నములోఁ కలియుటచే నదియును ద్వాదశినాఁడు ప్రశస్తమయ్యెను. వైద్యశాస్త్రము ననుసరించి భోజనపదార్థము లేర్పడినవి. తరువాతకథ వినుడు. ఋషీశ్వరు లీప్రకారము చెప్పి రాజుచేవీడుకోలువడసివారివారియాశ్రమములకుఁబోయిరి.

అనంతర మాభూకాంతుఁడుమంత్రిపురోహిత బంధుజనములనెల్ల నాలోకించి యిట్లనియె. ఆర్యులారా !వింటిరిగదా మునీంద్రులవాక్యము. నేనిఁక నేకాదశీవ్రతము నాచరింప నిశ్చయించితిని. మీరును మీవారును

లోకులెల్లరును నాబాలగోపాల మీవ్రతము చేయవలయునని నాకోరిక. అటైన శ్రీమన్నారాయణుఁడు మనకుఁ దప్పక సాయుజ్య మొసఁగును. అంతకంటెను మనకుఁ గావలసిన పురుషార్థమేదిగలదు? నీవొకఁడవు చేయరాదా, అందఱనేల పస్తుండుమనెద వందురేమో, అల్పకష్టము మహాఫలము. ఇట్టిఫలమును నేనొకఁడనే పొందుట నాకుఁదృప్తికరముగాదు. స్వాదుపదార్థ మొక్కఁడే భుజింపరాదుగదా, కావున నిశ్చయమైన శుభమునుమన మందఱమును భవించిననే నాకుఁదృప్తి.

అనిన రాజుమాటలువిని వారెల్లనేకవాక్యముగనిట్లనిరి. "మహీపాలా ! మాకు నీవిషయ మింతగఁ జెప్పవల యునా ? రాజానుమతముగదా ధర్మము ? యథా రాజాతథా ప్రజాయనుట మే మెఱుఁగమా ? కావున మీరేది ధర్మమని యాచరింతురో యదియే మేమును నాచరింతుము. ఇంతచెప్పఁ బనియేలేదు. అయినను లోకుల కెల్లఁ దెలియ మీరుమనరాష్ట్రమునందంతయుఁ జాటింపఁ బంపుట కార్యము.

రుక్మాంగదుఁ డామాటలు విని లెస్స చెప్పితి రని లోకమునఁ జాటింపఁ దగునేర్పాటులు చేయుఁడని యమాత్యులకాజ్ఞాపించెను. అమాత్యులును దలవరులఁబిలిచి చెప్పవలసిన విషయము చెప్పి రాష్ట్రమునందెల్లఁ జాటింపనేర్పాటుచేసిరి. తలవరులను భేరులు శంఖములు తప్పెటలు కొమ్ములుకొని మ్రోగించుచు పల్లెపల్లె యూరూరునగరనగరముకుఁబోయి వీధివీధి వాడవాడ సందులుగొందులుఅన్నితిరిగి తిరిగి యిట్లు చాటించిరి.

ఓ మహాజనులారా ! వినుండో ! యిది రాజ్ఞాజసుండో దశమినాఁడభ్యంజనస్నా మాచరించియొక్క ప్రొద్దుండవలయుసుండో, ఏకాదశినాఁడు నిరాహారులై రాత్రియందు జాగరణము చేయవలయును జుండో. ద్వాదశి యుదయముననే యిష్టులతోనాడు శిష్టులతోడను బారణము సేయవలయుఁ జుండో. ద్వాదశినాఁడుపగట నిద్దురగాని రాత్రిభోజన ముగాని చేయరాదుచుండో. ఈప్రకార మందఱువీరువారనక చేయవలయు నుజుండో. ఇది రాజాజ్ఞసుండో. తప్పినఁదప్పుసుండో. ఇది నారాయణునకుఁ బ్రీతికరము సుండో, కైవల్యలక్ష్మికి మార్గముసుండో యనియఱచి ఢమ ఢమధ్వనులు గావించిరి.

రాజును బురమంతయు నలంకరింపఁ జేసి దశమి నేకభుక్తుడై యేకాదశిని నుదయముననే నదికిఁ బోయి స్నానమాచరించి వచ్చిపూజా మందిరముఁజొచ్చి యాహ్నికముల నెల్లఁ దీర్చికొని ద్వాదశాక్షరమంత్రమును జపించి విష్ణుపూజగావించి వెడలివచ్చి పురాణకథ లాలించును దినముగడపి రాత్రులందు హరికథాశ్రవణము తోడను, దివ్యావతారముల కథలు నాట్యమాడించిచూచుటతోడను, సంకీర్తనములతోడను భజనముల తోడను జాగరణము చేసెను. ఉషఃకాలముననే మరల స్నానమాచరించి యనుష్ఠానము లెల్లఁదీర్చి నారాయణునర్చించి యిష్టులతోడను శిష్టులతోడను బారణగావించి యాపవలునిద్దురపోక యుండి రాత్రి భుక్తిమాని యథావిధివ్రతంబు సాంతంబుఁ గావించెను. ప్రతిగ్రామముందును బ్రతిపల్లియందును నింటింట నీ ప్రకారమే యెల్లవారును జరపిరి.

ఆవ్రతప్రభావమున నెలకు మూఁడు వానలు తప్పకకురియుచుండెను ఆవులు చిన్నవియఁ బాలుపిదుకు చుండెను. ఎన్నఁడు నేరువాక సాగని కొండమిట్టలును, ఊగొట్టునేలలును నవారిగఁబండుచుండెను. పోఁకకుఁ బుట్టెడమ్ముచుండిరి. ఫలవృక్షములు సకలఋతువులఁ బండుచుండెను ఆధులు వ్యాధులు నీతిబాధలు నెందును లేకుండెను. ప్రతిగృహము భార్యాభర్తలు పుత్రులు పుత్రికలు పౌత్రులు గలదై ధనధాన్యసమృద్ధిచే శోభిల్లుచుండెను. అకాలమరణములుబాల్యమరణములులేవయ్యెను. జారచోర భీతిమాసెను. కఱవుకఱవయ్యెను. ఆయన రాజ్యమునఁ బశుపక్షి క్రిమి కీటకాదులును వైకుంఠమునకుఁబోవుచుండెను యమలోక మార్గము పాడుపడెను. ఆత్రో నలలోగడ్డి గాదము మొలచిపోయెను. ఈ ప్రకారము కొన్ని సంవత్సర ములుగడచెను.

భగవంతుని యనుగ్రహమువలన నారాజునకు భార్యయగు సంధ్యావళీయందు ధర్మాంగదుఁడనుకుమా రుఁ డుదయించెను. అతఁడును శుక్లపక్ష చంద్రునివలెఁ గ్రమక్రమముగఁ బెరిఁగి పెద్ద యయ్యెను. రాజును మాళవరాజుకూఁతురు చంద్రరేఖ యనుదానిం గుమారునకు భార్యగా వివాహము కావించెను. యుక్తవయస్కుఁ డైనపుత్రుని యువరాజుఁ జేసి రాజ్యభారమతనిపై వైచిరాజు హరిభక్తి పూర్ణహృదయుఁడై భగవత్సేవయందుఁ గాలముగడుపుచుండెను. రుర్మాంగదుఁడును ధర్మపద్ధతియు హరిభక్తియు మానక బాలుఁడయ్యు మిగుల హెచ్చరికతోఁ బ్రజారక్షణముగావించుచుండెను.

## నారదుఁ డు యమునిఁ జూడఁ బోవుట.

అంతటనొక్కనాడు నారదమహర్షి యు మూఁపుననున్న మహతి యాకాశవాయువు తాఁకున సరిగమపదనిస స్వరములు తప్పక మ్రోగుచుండ భాగీరథీజలపూర్ణమైనకమండలువు చేతియందుఁ గ్రాలుచుండ వక్షస్థలమున తులసిపూసలపేరులును జెవియందుస్ఫటికముల జపమాలయు వ్రేల, నడుమునగృష్ణాజినమును ధరించి కలహ ముల వేడుక చూచునపుడు నర్తింపననువై నచామరమును గక్షపాలయు భుజాగ్రమున మెఱియ, జడలు సంజ కెంజాయలను దేహమకాల చంద్రికలను వ్యాపింపఁజేయ నారాయణసంకీర్తనము

గావించుచు యమునిమందిరమునకుఁ బోయెను.

యముఁడు నారదునిరాక విని యెదురేగి నమస్కారము లాచరించి తోడితెచ్చి యర్ఘ్యపాద్యములిచ్చి,యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి యిట్లనియె.

దేవమునిప్రవరా ! ముల్లోకములయందు నీవు సదాసంచారముచేయుచుందువు.త్రికాలముల నగువార్తలునీయెఱుంగనివి లేవు.నన్నొక పెద్దసందేహము పీడించుచున్నది.దానిని దొలిగింపనీవ యర్హుఁడవు.దీర్ఘ కాలముగ నాలోకమునకు మనుష్యులు రాకున్నారు.దీనికిఁ గారణమేమో నేనుహింపఁ జాలకున్నాను.నారాజ్యము పాడుపడె నాప్రభుత్వమాఱడిపోయెను.నాదుర్దశ యేమని చెప్పుకొందును.

“ పూర్వము భూలోకముననుండి యర్బుదన్యర్బుదసంఖ్యులుగ నన్నవిక్రయులు,వేదవిక్రయులు,కన్యావిక్రయులు,దేవాలయాధికారులు,సురాపాయులు,గోవధము(బ్రాహ్మణవధము స్త్రీవధము శిశువధము చేసినవారు, అన్యకాంతాసక్తులు,అన్యపురుషసక్తులు,అనాచారులు,దురాచారులు దుష్టాన్నభో క్తలు విశ్వాస ఘాతకులు,అనృతతభాషణులు,తేరకొకరిపైనిందమోపువారు,గురుద్రోహులు,పిసినిగొట్టులు,పంక్తిభేదముచేయువారు,చేసినమేలు మఱచువారు,జూదరులు,భగవంతుని భక్తులదూషించువారు,కులాచార దూరులు,అంటరానిసతులఁ గూడినవారు, ఇంట బాలురు వృద్ధులు కాచియుండవారి కిడక తాముముందు భుజించువారు,తప్పుసాక్ష్యము చెప్పువారునీచుల సేవించువారు,తమకంటె హీనజాతిపరుషులఁగలయు స్త్రీలు హీనజాతిస్త్రీలఁగలయుపురుషులు, విలోమవర్ణసంకరులు,పరదారలబరధనముల హరించువారు,కులభ్రష్టులు,రణభూమిని బరుగెత్తుపిఱుకులు, పాషండులు, శరణాగతుల రక్షింపనివారు మిత్రద్రోహులు,స్వామిద్రోహులు, నిర్దోషులైన యాశ్రితుల భరింప శక్తిగలిగియు వర్జించువారు,విషదాతలు,గృహదాహకులు,దప్పిగొన్నవారి కుప్పునీళ్ళిచ్చువారు,భర్తల ధిక్కరించు స్త్రీలుసాధ్వులగుభార్యల నవమానదృష్టి జూచుపతులు, జీవహింస చేయువారు,ప్రజలు సుఖపడ బాలింపని రాజులు,కుక్షింభరి సన్న్యాసులు,నిర్దోషుల దండించుప్రభువులు, ఈమొదలుగా ననేకులు నాలుగువఁకలు పట్టకుండఁబ్రతిదిన మరుదెంచుచుందురు.ఇప్పు దూరంతయు బాడుపడినట్టున్నది.భటులు పనిలేక తిరుగుచున్నవారు.భూలోక జనులు నాలోకమునకు,రాక తప్పించుకొను నుపాయ మేది కలిగెనో యెఱిగింపు” మనిన నారదుండిట్లనియె.

ధర్మరాజా ! కారణము లేక కార్యము కలుగదు.జ్ఞానయోగము చేతఁగాని, భక్తి యోగము చేతఁగాని,కర్మయోగము చేతఁగాని,భగవంతుఁడైన శ్రీమన్నారాయణు సేవించువారు నీలోకమునకు రారు.సృష్టి యాదియందు జనులందు గామక్రోధాధిదుర్గుణములు లేకుండుటచేనప్పుడు నీతోడనే పనిలేకుండెను.ఆకాలమున నొకగ్రామమున జనులందఱు కలసి పైర్లుపండించుచుండిరి.ఆధాన్యమునంతయు నొకచోటనుంచి యందునుండి కావలసినవారు వారికి వారికిఁగావలసినంత కొనిపోవుచుండిరి.ఎంతమాత్రముగ్రాసమునకుఁ గావలయునో యంతమాత్రమే కొనిపోవుచుండిరి గాని యెక్కువగఁ గొనిపోయి దాచిఁయుంచుద మనెడు కుత్సితబుద్ధివారికి లేకుండెను.తక్కువ కష్టముచేసినవాఁ డెక్కువగఁ దినుచున్నాఁడని యిట్టి వేఱిమిబుద్ధులు వారికి లేకుండెను.క్రమక్రమముగ మోసములోభముక్రోధము కామములోనగు దుర్గుణము లుత్పన్నములయ్యెను.దానివలనఁ బాపము హెచ్చుయ్యెను.అప్పటికి మృత్యువు లేకుండెను.పాపము హెచ్చయినకొలంది భూమి భారమును సహింపలేకుండెను. అప్పుడు బ్రహ్మదేవుఁడు మృత్యుదేవతనుసృష్టించి నీవువీరి నెల్ల వధింపుమని నియమించెను.ఆస్త్రీయయ్యయ్యో యింతటి ఘోరకార్యము నేనెట్లుచేయుదును ? నేనొకనిని జంపిన వాని బంధువు లందఱు శోకింపరా! ఆదుఃఖము నేనెట్లుజూడఁగలను ? వారందఱు నన్ను శపింపరా ? యని గోలు గోలున నేడ్చెను.అప్పుడు బ్రహ్మదేవుఁడు దాని నూరార్చి నీకన్నుల నుండి యెన్ని నీటిబిందువులు రాలెనో యవి యన్నియు రోగములగును.అవి జనులను బీడించును.వానిచేతఁ జచ్చిరని పేరు వచ్చును గాని నిన్నెవ్వరు దూషింపరు.అని సమాధానపఱిచి పంపెను.అప్పుడు నిన్నింతకుయజమానుఁడుగా బ్రహ్మ నియమించెను.కావునఁ బూర్వకాలమునందువలె నిప్పుడు దుర్గుణరహితులై భగవద్భక్తిసహితులై నవారు మోక్షమునకుఁ బోవుచుందురు.ఇప్పుడు భూలోకవాసులు తమ రాజగు రుక్మాంగదుచేఁ బ్రేరింపఁబడి యేకాదశీవ్రత మాచరించుచున్నవారు.ఆవ్రతము మహాత్మ్యము చిత్రము ఆవ్రత మారోగ్యప్రదము.ఆయుర్వృద్ధికరము.మనోవశీకరణమునకు సాధనము.కామక్రోధాదులకు వేఱువిత్తు. చిత్తైకాగ్రతకుఁ గన్నాకు.శ్రీహరికిఁ బ్రీతికరము.కావున దాని నాచరించువారు నీలోకమునకురారు.వైకుంఠమునకుఁ బోవుదురు.నీయిప్పటి దుస్థితికి దియే కారణము.అయినను నీవు బ్రహ్మదేవుని దర్శింపనేగి యాయనతో నీదుర్దశ విన్నవించితివేని దానికిఁ దగునుపాయమాయన చెప్పును.అని బోధించి యథేచ్ఛ మేగెను.

===========

## యముఁడు బ్రహ్మతో తన దుఃఖపాటు విన్నవించుట.

శమనుండును నారదుండు చెప్పినచొప్పు శ్రేయస్కరమని తలఁచి మహామహిష వాహనారూఢుఁడై

యిరువంకలఁ గింకరులుబలసి కొలువ నూర్ధ్వలోకములన్ని కడచి సత్యలోకమునకుఁ జని యనేక సహస్ర ఋషిసంఘములు సేవింప భారతీసమేతుఁడై పేరోలగమున్న చతుర్ముఖు నీక్షించి దండవత్ప్రణామము లాచరించి కరములు ముకుళించి నిలువఁబడిత నరాకకుఁ గారణము ప్రశ్నించిన నప్పరమేష్ఠితో నిట్లనియె.

" లోకపితామహా ! నావిన్నపము సావధానచిత్తమున నాలకింపవలయును. ఈదండము ఈపాశము వీనితోనాకిఁక నేమియు కార్యము కనఁబడలేదు. భారమాత్రప్రయోజనములై యున్న వీనిని నీకు నర్పించి యెందే నిపోయి తపశ్చరణఁ గాలము గడప నిశ్చయించితిని. అంతటికారణ మేమివచ్చె నందువేని వినుము.

ఇప్పుడు భూలోకమును రుక్మాంగదుఁడను రాజు పాలించుచున్నాఁడు ఆయనయత్యంతవిష్ణుభక్తుఁడై హరివాసర వ్రతమాచరించుచున్నవాఁడు. అంతియకాదు. తాఁజెడ్డక్రోతి వనమెల్లఁ జెఱిచినట్టు లోకులందఱచే నావ్రతము విధ్యుక్తముగఁ జేయించుచున్నవాఁడు. ఆవ్రతప్రభావమున నందఱు వైకుంఠమునకే పోవుచున్నారుగాని నాలోకమునకు నొక యాఁడుదిగాని మగవాఁడుగాని తుదకుఁ బశుపక్ష్యాదులుగాని వచ్చుటలేదు. అంతమాత్రమే కాదు. ఇదివఱకు నరకయాతన లనుభవించుచుండని వారును తమవంశము వారు చేయు నావ్రతము ప్రభావము వలన మోక్షమునకుఁబోయిరి క్రొత్తనీరువచ్చి ప్రాఁతనీటిని గూడఁ గొనిపోయినట్టయ్యెను. నాలోకమంతయు నా లోకింపఁబాడు వాఱుచున్నది.

ఇనుపముక్కులకాకు లెందెందో యెగిరిపోయినవి. నిప్పులనదిమీఁద నివుఱుగప్పిపోయినది. అసిపత్రవన మంతయుఁద్రుప్పుపట్టినది అగ్నికుండము లాఱిపోయినవి. ఎఱ్ఱగ క్రాఁగియుండు నుక్కు స్తంభములు శీతలములైనవి. కఱకుఱంపములు మంగలకత్తులు వాఁడిచెడి మొద్దుపాఱినవి. వాలుకాయంత్రమున నానగరము వారు పేలాలు వేయించుకొనుచున్నారు. కుంభీపాకము కుంభీపాకమున కనువైనది. రౌరవాదినరకములు నిశ్శ బ్దములైనవి. పూర్వమెప్పుడును సలసల క్రాగుచుండిన బాణలిలోని నూనెయిప్పుడు స్త్రీలతలమెఱుగున కగుచున్నది. ఇన్నిదినములు చేసినకష్టమునకు విశ్రాంతియోయన నాకింకరులందఱు పనిలేక యింటఁదూఁగు చున్నారు. అదియేమిచిత్రమో చిత్రగుప్తుఁడు వ్రాసియుంచినకథల లన్నియు నెంతపదిలముగానో కట్టి కాపుంచి రక్షించుచుండిన నిప్పుడు విచ్చిచూడ వానియందు నొక యక్షరమైనను లేదు. అవి వాడని క్రొత్త పుస్తకములవలె నున్నవి. భూలోక మునకు వచ్చుపోవు మార్గమునఁగంపచెట్లుమొలచినవి. భోజనకాలముల ధర్మరాజాయచిత్ర గుప్తా య యని మెతుకులు వైచువారిప్పుడు మానామమేస్మరింపరు. నాకొలువుకూటమున బూఁజులువ్రేలాడు చున్నవి. పూర్వ మింటి పట్టున నిలువ నొక్కఘడియయైన విరామము లేక సంచారముచేయుచుండిన అజీర్ణవ్యాధి, జ్వరము, తలనొప్పి,శోఫ, పాండువు, క్షయము, శ్వాసకాశము, అర్శస్సు, కృమిరోగము, రక్తపిత్తము, ఉన్మాదము, ప్రమేహము,లోనగు రోగము లన్నియు నిల్లువిడిచి కదలక సుఖించుచున్నవి. పనిలేని కారణముచే నీరోగములకే యీరోగములు సంభవించినవి.

దేవా ! నే నేమని మనవి యొనర్తును. పరులపైఁ దేరకు నిందలాడువారినాలుకలు మంగలకత్తులచేఁ గోయలేదు. కొండెములు వినువాని చెవులలో కఱకునారసములు దూర్పలేదు. పరులమేలిమి చూచి యోర్వలేని వాని కన్నులలోఁగాలుచున్నయెఱ్ఱని యినుపశలాకలఁ గ్రుచ్చులేదు. దేవాలయముల నధికారులుగానుండువారిని, ననుకూలవతియైన భార్యను వదలినవారిని, దేవాలయములందు జారచోరభావంబులఁ జరించువాని,నగ్నికుండ ములలోఁ బొర్లింపలేదు. నిష్కారణముగ నొకఁడు నొవ్వ నిష్ఠురము లాడువానిని బరులమనస్సు నొప్పించువానిని గణుఁదురులచేతను, దేళ్ళుపాములచేతను గఱిపింపలేదు. అప్పుతీసికొని మరల నియ్యని పాపిదేహమునకు గడ్డివెంట్లుచుట్టి చమురున ముంచి దహింపలేదు. ఎక్కువ వడ్డి కొనులోభిని నినుపరోకండ్లతో మోఁదలేదు. పశు పక్ష్యాదుల హింసించు వారిని నినపముక్కల కాకులచేఁ బీఁకించి కత్తులచే నఱికింపలేదు. గోహత్య స్త్రీహత్య కావించువారిని కుంభీపాకమునఁద్రోయలేదు. ఇతరుల భార్యలను నిందుంచువారిని క్రాఁగినయినుకపైఁ బొర లింపలేదు. తానుజేసిన ధర్మములను దానేపొగుడుకొనువానిచోట సీసము కరఁగించి పోయలేదు. పరస్త్రీలతోడను బరపురుషులతోడను సంభోగించువారిని కనకనమండు నినుప బొమ్మల కవుఁగిలింపఁజేయలేదు. పరులకుఁ గీడుచేయ నాలోచించువానితల ఱంపములచేఁ గోయింపలేదు. అభోజ్యపదార్థములఁదిను తిండిపోతులపొట్టలు చీల్పలేదు. దప్పిగొని నీరడిగిన లేదనువారినోట నూనెక్రాఁచి క్రుమ్మరింపలేదు. ఉప్పునీరిచ్చువారిచేతులనుమంట లలోఁగాల్చి గుండెలు చీల్పలేదు. కలయఁగూడని రాత్రులందు సంభోగించు స్త్రీపురుషుల సలసలక్రాఁగు నేతి కుండలలో వేసి యుడికింపలేదు ధర్మమెఱిఁగియుండియు లాభలోభ పక్షపాతబుద్ధులచే నధర్మము చెప్పువానిని నీరు లేనిపాడుబావిలోఁ దలక్రిందుగఁద్రోచి మీఁద బండలు వేయలేదు. కన్యకల విక్రయించువారిని నసిపత్రవ నము వైచికండలు నఱకలేదు. వరశుల్కమపేక్షించు దుర్జాతులను గరఁగిన బంగారు మూసలలొ నడగఁద్రొక్క లేదు. న్యాయముతప్పి చరించు ప్రభువలను గూటశాల్మలిలో వైవలేదు. పంక్తిభేదము చేసినవారినోట నిప్పులు

పోయలేదు. పశువులు పక్షులు దాహముగొని నీరు ద్రావ వచ్చినచోట నురులు పన్నిన నీచులను ఆంకట దప్పిని మలమల మాండంజేసి కాలుసేతులు గుదియంగట్టి మండెడు నెండలోం ద్రోయలేదు. చేసిన మేలు మఱచువారిని కాలిన యినుప మఱ్ఱిచెట్టున తలక్రిందుగంగట్టి క్రిందమంటలువేయలేదు. అతిభోగాసక్తులైన స్త్రీపురుషుల నొక కాండికి గట్టిదిసమొలల వీథులవెంటం దోలలేదు. ఫలవృక్షముల నఱికినవారిని జీవుల కుపయోగించు చెఱువులు బావులు చెఱిచిన వారిని కొండమీంద నీరులేనిచోట నిడి చర్మము లొలువలేదు. త్రాగుట కుపయోగపడు జలము లుగల నదులందును తటాకములు లోనగువానియందును మలమూత్రములు విడుచువారిని గదలతో మొత్తి మలమూత్రములను భుజింపంజేయలేదు. విషముపూసిన బాణములచే వేంటాడువారిని నినుప పెనములమీంద వైచిప్రేలింపలేదు. అశుచిగానుండి గోవులను విప్రులను నగ్నిహోత్రుని దాంకువారికరములను, నట్టులే మలమూత్ర ములు విడుచుచు సూర్యచంద్ర నక్షత్రములను జూచువారికన్నులను కొఱవులం గాల్పలేదు. అమావాస్యలందు దున్ను వారిని ఆదినములందు చెట్లు నఱకువారిని విషకుండములలోంద్రోయలేదు. కుక్కను, కోడిని, పేడిని, వ్యభిచరించువారిని, ఊరంబందిని, ముట్టుతను, మత్తుపదార్థములం దినువారిని అట్టివిద్రాగువారిని, వంశాచారముల వదలినవారిని, పురుడు సూతకముకలవానిని, పీనుంగును, ఎలుకను గాడిదను, పిల్లిని, కమసాలిని దాంకిస్నానముచేయనివానిని నగ్నులలోం ద్రోయలేదు.

రుక్మిణి–అప్పా ! యెన్నినరకములు ?

తండ్రి–తామిస్రము, అంధతామిస్రము, రౌరవము మహారౌరవము, కుంభీపాకము, కాలసూత్రము, ఆసినపత్రవనము సూకరముఖము, అంధకూపము, క్రిమిభోజనము, సందంశము, తప్తసూర్మి, వజ్రకంటక శాల్మలి, వైతరిణి, పూయోదము, ప్రాణరోధము, విశసనము, లాలాభక్షము, సారమేయాదనము, అవీచిఅయఃపానము, క్షార కర్దమము రక్షోగణభోజనము, శూలప్రోతము, దందశూకము, అవటనిరోధము, పర్యావర్తనము, సూచీముఖము, అని యిరువదియెనిమిది ముఖ్యనరకములు.

రుక్మిణి–ఏయేపాపములు చేసినవారే యేనరకమునకుంబోవుదురు ?

తండ్రి–ఇతరులధనములను పుత్రకళత్రములను అపహరించువాండు యమకింకరుల పాశము లచేం గట్టంబడినవాండై తామిస్ర మనునరకమున కూడు నీళ్ళు లేక కొండలమీందినుండి క్రిందికి దొరలింపం బడి బడితలతో మోందంబడి మహాభయంకర రూపముల బెదరింపంబడి తాళలేక మూర్ఛపోవుచు లేచుచు దుఃఖపడుచుండును. ఈనరకము చీంకటిమయముగా నుండుట వలనం దామిస్రమని చెప్పంబడును.

ఇతరపురుషులను వంచించి వారిభార్యలతో భోగించువాండంధతామిస్రమునంగూలును. మీం ది నరకమునందువలెనే యిచ్చటను దుఃఖ మనుభవించును గాని దానికంటె నిందలి బాధలు దారుణ మగుటచే జీవిమతిచెడి కన్నులుపోయి వేఱునఱికిన చెట్టువలం బడి సహింపరాని దుఃఖముల ననుభవించును. ఈనరకములో గాఢాంధకారము నిండియుండుటేకాక దుఃఖమనుభవించువానికిం గన్నులు గానరాక గ్రుడ్డివలె నుండును గనుక దీనికి సంధతామస్రమని పేరు.

ఈభూలోకమున నెవండు "నేను" 'ఇదినాది" యని యంహంకార మమకారములుకలవాండై యితరులకుద్రోహముచేసి తన కుటుంబమును రక్షించునో వాండు వీనిన్నటిని నిందే వదలి తానొక్కండే రౌరవన రకము పాలగును. ఇక్కడ నెవరెవరికి ద్రోహముచేసెనో వారు రురువులను పెనుబాములై వానిని గఱచుచుభయ పెట్టుచుం దఱముచు నానావిధముల బాధింతురు. పాములకంటె నతి క్రూరములైన భూరిశృగములనుజంతువు లు హింసించు నరకము రౌరవ మనంబడును.

ఇంతకంటెను గ్రూరమైనది మహారౌరవము. అందుంబడినవాని మాంసమును పురువులు కొఱికి తినుచుండును. ఈ యన్ని నరకములందు నెంతబాధపడినను ప్రాణముపోదు. బాధయిక్కడికంటె నెన్నియంతలో యెక్కువగ నుండును.

తపదేహరక్షణార్థము పశువులను బక్షులనుజంపించి వండి తినునట్టి దయాహీనుండు కుంభీపాక మనునరకమునం బడును అందుం గాలకింకరు లాపాపాత్ముని క్రాంగుచున్నచమురు కుండలలో వైచి యుడికిం తురు.

తల్లిదండ్రులకు బ్రాహ్మణులకు ద్రోహముచేసినవారిని కాలసూత్రమనునరకమున వైతురు. ఈనర కముపదివేలయోజనముల విరివిగలది. ఇందుకళ్లముపంటి రాగిఱేకుపైం బాపాత్ముని వైచిక్రింద మంటవైతురు. మీంద నెండలు మండుచుండును. ఈరాగిరేకు పెనముపైవైచి వేయించుచు నాంకలిదప్పియని మొఱ్ఱోయని యేడ్చుచున్ననుకూడుపెట్టక నీళ్ళియ్యక పరువెత్తుచున్నను వదలకవీరు ద్రోహముచేసినవారి దేహముపై నెన్ని వెండ్రుకలున్నవో యన్నివేల సంవత్సరములు కింకరులు బాధింతురు అయ్యో చచ్చితిని రక్షింపుండని ప్రార్థించిన



తామిస్ర నరకము



రౌరవ నరకము

వారు విడువరు.

ఆపదలందనఁగా దేశకాలవైపరీత్యమందును రోగాది బాధలందునుదప్పఁ దమతమవర్ణములకు నాశ్రమములకు వేదశాస్త్రవిహితమైన యాచారములను వదలి తమతమ యిష్టప్రకారము సంచరించుచు పాషం డులమార్గ మవలంబించిన వారిని అసిపత్రవనమునఁ దోలుదురు. ఈవనమునందుఁ జెట్లకు రెండుప్రక్కలఁ బదునుగల కత్తులే యాకులుగా నుండును. పాపాత్ములను కింకరు లీనరకమునఁ ద్రోచి పరువెత్తుదని కొఱడాలతోఁ గొట్టుదురు. ఈదెబ్బలు తాళలేక జీవిపరువెత్తును. అట్టు పురు వెత్తునపుడు కత్తులతో రాచుకొని యాప్రక్కనాప్రక్క దేహము చెక్కలు చెక్కలుగఁ గోసికొని పోవుచుండును. ఇట్లు దేహము పనసకాయ కుందినట్టు కాఁగా నయ్యయ్యో యని యేడ్చుచుఁ బరువెత్తుచుండును.

రాజులు గాని దండించు నధికారముగలవారు గాని నిర్దోషులను దండించినను,దేహదండనము విధింప రానివారికి దేహదండనము విధించినను యమకింకరు లట్టివారినిబట్టి సూకరముఖ మను నరకమువైచి యేనుఁ గు చెఱకుకోల విఱిచినట్లు విఱిచి యినుపదంతములుగల యడవిపంది నోటిలోఁ దూర్తురు. అది వారినిఁ గఱకఱ నమలుచుండును. ప్రాణముపోక బాధకుఁ తాళఁజాలక వారు హహాకారములు చేయుచుందురు.

భగవంతుఁడుకల్పించినవృత్తిచేజీవించుచుఁదాముచేయునదితరులకు బాధాకరమని తెలియక యితరు లకు బాధకలిగించుచుండు నల్లులు,దోమలు,ఈఁగెలు,పేలు,లోనగు పశుపక్షి సరీసృపములను హింసించునట్టివా రట్టిపాపముచేనంధకూపమను నరకమునఁ గూలుదురు. అందువారు హింసించిన జంతువు లన్నియు వచ్చి నిదురపోనీయక బాధించుచుండును. రోగాది బాధలచే దీర్ఘ కాలము నిద్రలేని శరీరియెంత దుఃఖించునోయంత కంటె నెన్ని మడుఁగులో యెక్కు వబాధ.

రుక్మిణి–ఆహారమునిమిత్తము పశువధచేసిన దోషము లేదందురు నిజమా!

తండ్రి–తాము చేయు పాపకార్యములు పాపకార్యములుకావని కొంద అందురు. యుక్తిమాటలచేత నేపాపము పోదు. నల్లులు, పులులు, సింహములు, ఇట్టివానికి నెత్తురు మాంసము భగవత్కల్పితమైన యాహార ములు మనుష్యులకు వృక్షమువలనఁ బుట్టిన పదార్థము లే భగవత్కల్పితమైన యాహారముగాని మాంసముకాదు. మాంస భక్షకులు పూర్వజన్మవాసనాబలమున నిపుడిట్టి ఘోరకార్యములు చేయుచు మాటలాడుటకు నోరుండు టచేఁ దెలియనివారిని మోసపుచ్చ ఆత్మసంతుష్టికై పెడయుక్తులు చెప్పుదురు. వారు చేయుకార్యము వలననే వారు గతజన్మముల నేమిజంతువులుగా నుండిరో యెఱుంగవచ్చును. మనుష్యులందును పులులు, పాములు, నెమిళ్ళు,పందులు, గాడిదలు, కుక్కలు, నక్కలు, నుండఁ జూడలేదా ?తరువాత వినుము.

ఎవ్వఁడు తనకు దైవమిచ్చిన భిక్షాన్నమైనను అతిధులకభ్యాగతుల కయిన వారికి నిడక వాయుసముప లెందా నొక్కఁడే భుజించునో యట్టివాఁడు చచ్చి క్రిమిభోజన మను నరకమునఁబడును. అందలిశత సహస్రయో జనంబులుగల క్రిమికుండమునఁ దాను క్రిమియై పురుగులను దినుచుఁ దాను బురుగులచే భక్షింపఁబడుచు నది యెన్ని యోజనములుగలదో యన్ని సంవత్సరము లయ్యయ్యో యెవరికిఁ బెట్టక తినినపాప మనుభవించు చున్నానని యేడ్చుచుండును.

ఆపత్కాలమునందుఁ దప్ప బలాత్కారముచేతఁగాని మృచ్ఛిలించికాని పరుల ద్రవ్య మపహరించువానిని గనకనమండుచున్న యినుపగుండులకుఁ గట్టికింకరులు కత్తులచేతను గండ్రగొడ్డండ్లచేతను ఛేదింతురు. కావున నే యీనరకమునకు సందంశ మనిపేరు.

తనభార్యతోఁ దప్ప పరస్త్రీతోఁ బురుషుఁడు కలసినను అట్టులే కలయరాని పరమపురుషునితో స్త్రీ కలసినను వారిని యమకింకరులు పట్టికట్టి కొనిపోయి తప్తసూర్మియను నరకమున వైతురు. ఈ పాపి స్త్రీ పురు షులను కొఱడాలఁగొట్టుచు బెదరించుచు నుక్కుతోఁ జేయఁబడి యెఱ్ఱగాఁ గాలియున్నస్త్రీవిగ్రహములను అట్టి పాపస్త్రీలను నట్టి కాలినయుక్కు పురుషవిగ్రహములను గౌగలించుకొని యుండఁ జేయుదురు. సూర్మియ నఁగా విగ్రహము.

ధనాశచే సేవింపరాని వారిని సేవించువారిని వజ్రకంటకశాల్మలీ నరకమున వెతురు. అందు మిగులవాఁ డి మొనలుగల ముండ్లు నిండి బూరుగువృక్షములుగలవు. వానిపైకింకరు లెక్కఁజేయుదురు.

రాజులుగాని రాజపురుషులుగాని యపాషండుల ధర్మసేతువులు త్రెంతురో వారిని కాలకింకరులు వై తరణియందు నీద్తురు. భిన్నమర్యాదులైన యీపాపులను యమలోకమునకు నగడ్తవలెనుండు నీనిప్పులనదిలోఁ బడవైచి యీడుచుచుండ జలజంతువులుపాములు మొసళ్ళు లోనైనవి పీఁకి తినుచుండదేహము తునకలయ్యి మరలఁ గఱచుకొనుచుండఁ బ్రాణము పోక బాధసహింపకలేక తాము చేసినపాపములను స్మరించుచు నేడ్చుచుఁ బెక్కువేలయేండ్లు మలమూత్రశోణితములచే తనుక్రోవ్వు ఎముకలు గోళ్లు మొదలగు వానిచేతను నిండి ప్రవహించి



అసిపత్రవన నరకము



సూకరవక్త్రి నరకము



అంధకూప నరకము



క్రిమిభోజన నరకము

నేటిలోఁబడి పొరలుచుందురు.

ఎవఁడు నీచజాతివాఁడు తనకంటె బ్రాహ్మణాద్యుత్తమ జాతులఁ బుట్టిన స్త్రీతో రమించునో యట్టివాఁడు శౌచాచార నియమ హీనుఁడు సిగ్గుమాలినవాఁడు పశువువలెఁ మరణానంతరము పూయోద మను నరకమునఁ బడి మలమూత్రములు జొల్లుకఫము లోనగువానిచే నిడిన మహాసముద్రమున మునుఁగుచుఁ దేలుచు నాపదా ర్థములనే తినుచుఁ దనపాపమున కేడ్చుచునుండును.

కుక్కలను గాడిదల సాఁకు బ్రాహ్మణులును,లోకరక్షణార్థమై గాక యూరక వేఁటాడువారును చచ్చి ప్రా ణనిరోధమను నరకమునఁ గూలుదురు. అందీపాపాత్ములను వారుమృగములను వేఁటాడినట్టుగఁ యమభటులు దఱుముచు బాణములచేఁ గొట్టుచుందురు. ప్రాణములను నిరోధింపఁ బాధపెట్టఁబడును. గావున నీనరకమున కీ పేరుగలిగె.

దాంభికులై యెవ్వరు దంభయజ్ఞములఁజేసి పశువధఁగావింతు రట్టిపాతకులను వైశస నరకమునఁ ద్రోచి యమభటులు నానాదుఃఖముల పాలుచేసి పశువులను నఱికినట్టు నఱకుదురు.

సజాతి భార్యయందుఁ దప్ప వీర్యస్ఖలనము గావించు కామమోహితుల దుష్టపురుషులను లాలారేతఃకుల్య యందుఁ ద్రోచి దానినే త్రావఁజేయుదురుకావున నీనరకమునకు లాలాభక్షమని పేరు. లాలయనఁగా జొల్లు.

చోరులుగాని రాజభటులుగాని యిండ్లు తగులఁబెట్టినను విషము పెట్టినను గ్రామములఁ గాని బిడారు లనుగాని కొల్లపెట్టినను, జీవహింసచేసినను వజ్రనిష్ఠురములైన కోఱలుగలిగి యమదూతలైనకుక్కలు ఏడుమా ర్లయిరువది పైఁ బడి కొఱికి పీఁకి పెఱికి తినును. కావున నీ నరకమునకు సారమే యాదన మని పేరు.

సాక్ష్యమందును క్రయ విక్రయములందును గల్లలు పలుకువారు అవీచిమంతమను నరకరమునఁ గూలుదురు. ఇట్టిపాపాత్ములను యమభటులు మిక్కిలి దుఃఖపెట్టి నూఱామడయెత్తైన కొండలమీఁదినుండి యలలు లేని నీటివలె చదరముగ నుండు చట్రాతిపైఁ దలక్రిందుగఁ ద్రోయుదురు. ఇట్లు త్రోయఁ బడి యాపాపి దేహము తనుకలు తనుకలు గానై చెల్లాచెదరయ్యును బ్రాణము పోక యవియెల్ల మరలఁ గలిసికొనును. మరల మరల నట్లే కాలకింకరులు త్రోయుచుఁ బీడింతురు దీనికే యవీచీనరక మని పేరు.

తనభార్యచే సోమపానము చేయించు విప్రుని,ప్రమాదమున సోమపానముచేయు రాజన్యవైశ్యులను, వారిమరణానంతరము శమనుభటులు కొంపోయిక్రిందఁబడవైచిఱొమ్ముపైఁ గాలువైచి త్రొక్కి పట్టి యుక్కుకరఁ గించి వారినోటఁ బోయుదురు. ఈనరకమునకు నయఃపానమనిపేరు.

జన్మముచే నికృష్టుఁడయ్యు విద్యాచారవర్ణాశ్రమముల వలనఁ దాను గొప్పవాఁడని తలంచుచుఁ బెద్దవారిని లక్ష్యపెట్టక యగౌరవపఱిచెనేని యట్టివాఁడు చచ్చినవానితో సమానుఁడే. వాఁడు చచ్చినపుడు వానిని యమభ టులు క్షారకర్దమ మను నరకమునఁ దలక్రిందుగఁ ద్రోచి దురంతమైన యాతనలపాలు పఱతురు. క్షారకర్ద మమనఁగా నుప్పుకారపుఁబదార్థములచే నైనబురద. దీనిలోఁబడినజీవి యుప్పుకారములో నూరవేసి నట్టులై తపించును.

దేవతలకుఁ బ్రీతియని నరబలి యిచ్చు స్త్రీ పురుషులు చచ్చి రక్షోగణభోజనమను నరకమునఁబడుదురు. ఇక్కడ హింసింపఁబడినవారు రాక్షసులై యుండి యానరకమునకు వీరు రాఁగానే వారిపై పడి వారిని నానావి ధముల హింసించి భక్షించుచుఁ గటికవాఁడు పశువులను ఛేదించినట్టు ఛేదించుచు బాధపడుచుండువారిని జూచి నవ్వుచుఁ, ద్రుళ్లుచు, నెగురుచు, నాట్య మాడుచుఁ బాడుచుందురు.

గ్రామములందును వనములందును నెవ్వరి కేయపరాధముచేయక జీవించుజంతువులకు నమ్మికపుట్టించి చేరఁదీసి వానిని సూదులఁ గ్రుచ్చియుఁ ద్రాడులఁ గట్టియు బాధించు పాపాత్ములు మరణింప వారిని యమదూ తలు శూలప్రోతమను నరకమునవైతురు. ఇందుఁ బాపాత్ముల మెడలో శూలములను గ్రుచ్చి యాఁకలిదప్పులచే బాధించుటేకాక సూదిముక్కుల కాకులు గ్రద్దలు కొంగలు బోరువలు లోనగుపక్షులకాహారముగవేయ నది కూచిముక్కులఁ బొడచి పొడిచి పీడింపఁ దమపాపముల స్మరించుచు వారు శోకించుచుందురు.

ఈలోకములో నెవరు పాములవలె నితరులను భయపెట్టుచుందురో యట్టిక్రూరాత్ములు చచ్చి దందశూక మను నరకమునఁ బడుదురు. అందు నై దుఏడుముఖములగల పెనుఁబాములు బుస్సు బుస్సు మనుచుఁ బైపడి వారిని బెదరించుచుఁ గఱచుచుండును. బాలురను,గ్రుడ్డులను, ఒంటికంటివారిని,బలహీనములైన యితర జంతువులను,గాదెలలో,బొక్కలలో, కణజములలోవైచినిర్బంధింతురో వారుమరణానంతరము అవటనిరోధ మను నరకమునఁ బడుదురు. అట్టివారిని గాలభటులు అట్టినిర్బంధమందుంచి దానిలో విషవహ్నులధూమముఁ

జొనిపి యూపిరాడకుండc జేయుదురు. అవటమనcగా బొరియ.

గృహస్థుఁడై యుండియు భోజనార్థులై వచ్చినపరిచితులైన యతిథులను,అపరిచుతులై నయభ్యాగతులను బలుమాఱు కోపదృష్టిచే దహించువానివలెఁజూచుచు నవమానపఱుచునట్టి వాఁడు చచ్చి యక్షిపర్యావర్తనమను నరకమునc బడ నందువజ్రతుండములైన కాకులు కొంగలు గ్రద్దలు లోనైనవి వాని కన్ను గ్రుడ్లను బొడిచి పొడిచి తినుచుండును.

ఎవఁడు తాను ధన్యాఢ్యుఁడ నని గర్వించుచు నితరుల సనాదరదృష్టిచూచుచు నెవ్వరేమడుగుదురో యేమి యియ్యవలసివచ్చునో యని భయపడుచు నితరులనోరగంటcజూచుచు వ్యయచింతచేc బీల్చుకొనిపోయిన హృదయవదనముల కలవాఁడై ధనపిశాచమువలె ధనమును రక్షించుచుండునట్టివాఁడు చచ్చి సూచీ ముఖమను నరకమునc గూలును. అందు యమభటులా పాపాత్మునిదేహము నిండ సాలెవాఁడు పేకపడుగు దారములు వేయునట్లు సూదులనీవంకc గ్రుచ్చి యావంకc దీయుచుందురు.

ఇట్టి నరకము లనేకములు గలవు. వీనియందుc బాపాత్ములు దుఃఖము లనుభవించి పాపకర్మ శేష మను భవింపమరల భూమిపై జన్మింతురు.

రుక్మిణి–పాపఫల మంతయు నరకమున ననుభవించెఁగదా ? ఇంకను పాపశేషమెక్కడిది?

తండ్రి–ఒకఁడు తానుచేసిన పుణ్యమునకు నంతయు ఫలము స్వర్గమందుcగాని పాపమునకంతయు నరకమునcగాని యనుభవింపcజాలఁడు. అందనుభవింపవలను పడని కొన్ని కర్మఫలము లుండును. ఒకరికి నీవు ఋణపడినను మఱియొకరు నీకు ఋణపడినను స్వర్గమందును నరకమందును మీరు ధనమార్జించుట ఋణముతీర్చుట లభింపదు. గావున మీరు మరల భూమి యందుజన్మింపవలయును. కరణకళేబరముతో నను భవింపవలసిన సుఖదుఃఖము లనుభవింప భూమిపై జన్మించుచుండవలయును. యాతనాశరీరముతో ననుభవింప వలసిన దుఃఖములనుమాత్రమే నరకమున ననుభవించును. సుఖమును దివ్యశరీరముతో ననుభవించును.

రుక్మిణి–తరువాతకథ చెప్పుము.

తండ్రి–యముని దీనవాక్యములను విని బ్రహ్మదేవుఁడాయనతో నిట్లనియె. సూర్యనందనా ! లోకులందఱు వైకుంఠమునకుc బోవుచున్నారని నీవు విచారపడరాదు. నీవు నేను లోనుగా సమస్తజీవులకుc బరమగతి యదియే కదా ! పాపము చేసినవారుగాని నీలోకమునకురాదు. నీయధికారము జరుగుటకై లోకులుపాపము చేయుచుండ వలయునని నీవు కోరుట తగదు. భూలోకమునc గొందఱు నీచులగు నుద్యోగస్థులు దమయుద్యోగము జీవనము రక్షించుకొనుటకై ప్రజలయందు లేని రోగదోషములను సృష్టిచేసి వారినిబీడించుచుందురు. నీకథ యట్టిద. నీ లోకమునకు వచ్చినవారిని నీవు దండింపవలయును గానిరాని వారికై విచారపడనేల ? నీలోకమునకు రాక తప్పించుకొను సదుపాయము లనేకములు గలవు.

అనంత కల్యాణగుణగణ విశిష్టుండును దయా సముద్రుఁడును, దీనజన రక్షాదక్షుఁడును, జగత్త్రితయు మాతయు భక్తవత్సలుఁడును నగు శ్రీమన్నారాయణు నామము జపించువారును,ఆదివ్యమూర్తిని బూజించువారు ను నీలోకమును గన్నెత్తి యైనc జూడరు.

అచ్యుత అనంత గోవింద యను నామములే సమస్తవ్యాదులకు నౌషధ మగుటగాక జననమరణవ్యాధి కి నౌషధము. యాగములు వ్రతములు నిష్ఠలు నియమములు తపస్సులు దానధర్మములు తీర్థయాత్రలు లోనైన యన్నిటికి ఫలము మనస్సు భగవంతునందు నిలుచుటే అట్టిఫల మీయని యాకర్మములు మరల జననమరణ దుఃఖములకుcగారణములగుచు,గజస్నానమువంటి వగును.

కంచి, కాశి, సేతువు, గయావటము, నైమిశము, పుష్కరము, కురుక్షేత్రము,కేదారము, అరుణాచలము, శ్రీశైలము, అహోబలము, అవంతి, ద్వారక,అయోధ్య,మధుర, గంగాద్వారము, వేంకటాచలము, వీనిని భక్తి తో దర్శించినవారు నీలోకమునకు రారు.

తే. చంపకారణ్యబదరికాశ్రమములందు
నూర్జితంబుగ శ్రీపురుషోత్తమమున
శ్రీహరిద్వారమున నొకరేయి నిద్ర
సల్పినీలోక మీక్షింపc జనరు నరులు ;

చ. సరయుపునందు వేగవతి జాహ్నవి నర్మదc దుం
గభద్రc బుష్కరణులc జంద్రపుష్కరణి గౌత
మిబాహుదc గృష్ణగండకీ దరుణులగోనుతిఁ బురుషుఁడు
తీర్థమాడినినుc బూని కనుంగొనc డర్కనందనా"

బీదలగుద్విజబాలుర కుపనయనము,చేయువారును,ఉత్తమకులమునఁబుట్టి గుణవంతు లైనబీదలకు వివాహోము చేయువారును,సత్పాత్రమునకు గోభూహిరణ్యాది దానములు చేయువారును,ఎండకాలములోఁ బశువులకు నీరుద్రావఁ దొట్టులేర్పాటు జేయువారును,శిధిలమగుచున్న దేవాలయములు నగ్రహారములు చక్క పఱుచువారును ; వృద్ధులైన తల్లిదండ్రులను,దన్ను బాల్యమునఁ బోషించినవారినిఁ భక్తి శ్రద్ధతోడ బోషించు వారును దేవాలయములు దేవాలయమునకుఁ బ్రజలుపోవు మార్గములు నూడ్చువారును దీపములు పెట్టు వారును ఎండకాలముల చలిపందిళ్లు వేసి దాహమార్చువారును గొడుగులు పాదరక్షలు బీదల కిచ్చువారును కఱవులు లోనగు కష్టవేళలఁ బ్రజల కన్నమిడువారును,ఇండ్లు కాలునపుడు సాహసించి లోపలదూఱి ప్రాణు లను రక్షించువారును జీవహింస సేయనిదయాళురును సద్గ్రంథములను వ్రాసినవారును వ్రాసినవారికి సాహా య్యముఁ జేసినవారును రోగములచే బాధపడువారి కూరక యౌషధము లిచ్చువారును చెఱువులు బావులు త్రవ్వించినవారును తోపులు వేసినవారును, అన్నదాతలును, నీపురమునకురారు.

రుక్మిణి–ఎందఱో కాశికి, సేతువునకుఁ, బుణ్య క్షేత్రములకుఁ బోవుచున్నారు.గంగాస్నానము చేయు చున్నారే వీరి పాపము లన్ని నశించినవా ?

తండ్రి–ఈ విషయమున నొక యితిహాసము కలదు వినుము.ఒకనాఁడు పార్వతీపరమేశ్వరులు లోకరక్ష ణార్థము సంచారము చేయునపుడు గంగాపుష్కరమగుటచే గంగానది యందుఁ గోట్లకొలఁదిగ స్నానముచేయు జనములఁజూచి పార్వతి పరమేశ్వరునితో నిట్లనియె దేవా ! యిందఱు గంగాస్నానము చేయుచున్నారే వీరికంద ఱకుస్వర్గముకలదా ? ఆపలుకులువిని పరమేశ్వరుడు "దేవీ ! నీసందేహముఁ దీర్చెదను.ఇప్పుడు నేనొకముసలి బ్రాహ్మణుఁడ నయ్యెదను.నీవుమిక్కిలి సౌందర్యము గలయువతివి గమ్ము మన మిరువుర మీ గంగాతీరమున నుందము. నేను ప్రాణముపోవువానివలెఁ గొంతసేపు నటించి మరణించినవానివలె నయ్యెదను.నీవు "నాపతి మరణించెనని రోదనము జేయుచుండుము.అంతేగాక యెవరైన పాపరహితులు వచ్చి నాభర్తను బ్రతుకింపుఁ డని వచ్చిన ప్రతిమనుష్యుని బ్రార్థింపుము.తరువాత జరగు వేడుకచూడుము" అని చెప్పి తాను ముదుసలిబ్రాహ్మ ణుఁడయ్యెను.పార్వతియు సుందరయువతియై పతిశిరమును దనతోడమీఁద నుంచుకొనికొఱప్రాణముతోనుండు భర్తకు పచరించుచున్నట్లుండెను.ఇంతలో నావృద్ధబ్రాహ్మణుఁడు మరణించెను.ఆయువతియు హాహాకారము చేయుచు నయ్యో యని తలమోఁది కొనుచు నేడ్చుచుండెను.స్నానమునకు వచ్చినవారందఱు నేమియని విచారిం చి దుఃఖపడుచుఁ జూచుచుండిరి.

అప్పుడాసుందరి వారినిజూచి "మీలో నెవ్వరైన పాపములేనివారుండిన నీశవమును దాఁకితి రేని యిది మరల జీవించును.ఈమాత్రము సాహాయ్యముచేసి పతిభిక్షయిండని యందఱను వేఁడుకొనెను.ఆ మాటవిని యందఱు వెనుకంజ వెట్టిరి.చూడవచ్చినవారందఱు ఆమె పలుకులువిని తమకాయోగ్యత లేదని మరలిపోయిరి. తుద కొక్కఁడు వచ్చి "తల్లీ ! నేను బాపహీనుఁడను.నేను నీపతిని బ్రతికించెదను" అని చెప్పి పోయి గంగలో మునిఁగివచ్చి తాఁకెను.చచ్చిన ముసలివాఁడు బ్రతికిలేచెను.ఆయిరువురు మాయమై పోయిరి.గంగాస్నానము వలన సకలపాపములు నశించునను నమ్మక మా కోట్లకొలది జనులలో నొకనికే గలదు.తక్కినయందఱు నీరు కోళ్లవలె మునిఁగినవారే.ఇట్టివారికి ధనము వ్యయమగుట దేహప్రయాసము మాత్రమేఫలము.శ్రద్ధాభక్తులు లేక మునుఁగువారికిని నీళ్ల లోని చేఁపలకుఁ గప్పలకును భేదములేదు ఇట్టులే తక్కినయన్ని తీర్థములు క్షేత్రములు వ్రతములునని తెలియము.

రుక్మిణి–అప్పా ! దానమువలనఁ బాపము వచ్చుట కూడఁ గలదని యొకసారి చెప్పితివే అది యెట్లు?

తండ్రి–ఒక బ్రాహ్మణుఁడు వీధివెంటఁ బోవుచుండెను.అప్పు డొకఁడు ఆఁకలిచే మలమలమాడుచు శుష్కించి కన్నులలోఁ బ్రాణములుపెట్టుకొని యెదురుగవచ్చి యాచించెను.వానినిజూచి కనికరించి యాబ్రాహ్మ ణుఁ డొకదమ్మిడి యిచ్చెను.వాఁడు బెస్తవాఁడు.వాఁడాదమ్మిడి తీసికొనిపోయి యొక గాలమున గొనెను.అగాల మునకు దారముగట్టి నీటిలో వై వఁగా నెరనిమిత్తమైవచ్చి యొక చేఁప దగులుకొనెను.దానిని దీసికొని భక్షించి మరల నట్లే రెండుమూఁడుమార్లు చేసి దొరికినవానినొక యరణాకమ్మెను.అట్లొకటి రెండుదినములు చేసి చేర్చినసొమ్ముతో జేఁపలుపట్టులకుఁ గావలసినకట్టెదారము కొనెను.ఇట్టులే క్రమక్రమముగ వృద్ధిచేసి కావలసిన ధనమార్జించి మిగుల ధనికుఁడయ్యెను.ఇట్లు ధనికుఁడైనను కష్టకాలమున బ్రాహ్మణుఁ డిచ్చినదమ్మిడివలసఁగదా మనకీమంచిదశవచ్చినదని మేలు మఱచినవాఁడు కాఁడు.తరువాత నొకనాడు తాను బాగుగ శృంగారించుకొని వెండిపళ్లెరములో వేయిరూపాయలు పోసుకొని దానిపైఁ బట్టువస్త్రముకప్పి పండ్లు తమలపాకులువక్కలుదాని యందుంచి యాబ్రాహ్మణునింటికివచ్చి సాష్టాంగముగ నమస్కరించెను.ఎవఁడో గొప్పవాఁడు వచ్చినాఁడని బ్రాహ్మణుఁడును గౌరవించి కూర్చుండుమనిచెప్పి యేలవచ్చితివి ? నీవెవ్వఁడవని యడిగెను.

వాఁడా వెండిపళ్లెర మాయనముందుంచి "అయ్యా నీవానాఁడు వీధిలోఁ బోవుచుండి నాకొక దమ్మిడియిచ్చి నాప్రాణమును రక్షించితివి. ఆదమ్మిడివలన నేనింతధనికుఁడనైతిని. నేను జాలరివాడను" అని తనవిధ మంతయుఁ జెప్పి దీనిని గ్రహింపుమని ప్రార్థించెను.

ఆ మాటలువిని బ్రాహ్మణుఁడు వెల్లఁబోయి తానుజేసినయపాత్ర దానమునకు దుఃఖించి యిట్లనియె. అయ్యానీకునేను జేసినసాహాయ్యమువలన నిన్నిజీవకోటులు మరణించెను. ఇంతటిహత్య నీవు చేయుటకు నేను గారణమైతిని. నీకది వృత్తియగుట మాత్రమున నీకు శ్రేయస్కరముగాదు, నీచవృత్తియందున్నను ధర్మవ్యాధునివలెఁ బాపమురాకుండ నడచుకొనువలయును. నీకు నేను సాహాయ్యము చేయకుండిన నిన్ని జీవకోటులు హింసింపఁ బడకయుండునుగదా. నీధనము నాకక్కఱలేదు. పొమ్మని పంపెను. ఆబ్రాహ్మణుఁడు చచ్చి హింసచేసిన వారు పోవునరకమునకుఁ బోయెను.

కావున నన్నదానము తప్ప మఱియేదానమైనను బాత్రతయెఱిఁగియేయియ్యవలయును. లేనియెడల వ్యర్థమగును. పాపమును గలుగును. పాపకార్యము చేయువారికి ధనసాహాయ్యము చేయరాదు. బిచ్చమెత్తుట జీవనాధారముగఁ జేసికొని (ప్రతిదినము రెండుమూఁడు సేర్లు బియ్యము సంపాదించి యమ్మి) ప్రతిదినము రెండుమూఁడు సేర్లు బియ్యము సంపాదించి యమ్మి ధనము మూటఁగట్టుకొని వడ్డికిచ్చి యుండియు భిక్షమునకు వచ్చు వారికి బ్రాహ్మణులకైనను భిక్షము పెట్టరాదు. ఇట్టివారి నూరు వెడలఁ గొట్టవలయునని భీష్ముఁడు ధర్మ రాజున కుపదేశించెను. వీరివలన దానపాత్రులకు దానము లభింపకున్నది. పోషింపలేనివారికి గోదానము అంగళ్లలో నమ్ముకొనువారికి వస్త్రపాత్రదానము, లోనైనవి యిచ్చుట వ్యర్థము. మఱిపాపావహము.

అమ్మణ్ణి–గోదానమువలనఁ బాపమెట్లువచ్చును ?

తండ్రి–చెప్పెదనువిను. అవును దానముగఁ గొనిన వాఁడు దానికి మేపు నీళ్లు చక్కగ నిడుచుదాని పాలను దాను భార్యబిడ్డలు అనుభవించుచుఁ దల్లిపాలు లేని చంటిబిడ్డలకు రోగులకు ధర్మబుద్ధి నిచ్చుచుండిన యెడల దానమిచ్చినవానికిఁ బుచ్చుకొనినవానికిఁ బుణ్యముకలదు. నేను జూచినంతలో నిట్లు చేసినవారు లేరు. ఆవును దానముగఁ గొనినవారు కొందఱు దానిని మేపుట భారమనితోఁచినవెంటనే యెంతవేగిరము బేరము వచ్చిన నంత వేగిరము విక్రయింతురు. ఇట్లు విక్రయించుటచేత గోదాతకుఁ బుణ్యములేదాయెను అంతేకాదు అట్లు కొనినవారు కొందఱుపాఁడి యుడుగఁగానే కటిక వారికి విక్రయింతురు. కొందఱువిక్రయించుకొనునపుడే ముందుగఁగటిక వానితో మాట్లాడి బేరము నిశ్చయించుకొనియే తరువాతఁ గొందురు. ఈమధ్యవర్తి యుభయులవలన లాభముపొందును. కొందఱు దాతలు ప్రతిగృహీతలనే 20–30 రూప్యములలో మంచి యావును దెమ్మందురు. వాఁడొక గొల్లవానితోనో కాఁపువానితోనో మాట్లాడి వానికొకటో రెండో రూపాయలిచ్చి వానినే యావును దాతయొద్దకుఁ దోలుకొని రమ్మని చెప్పి తాను దాని వెలయిచ్చితిననిచెప్పియారూపాయలు తాను తీసికొనును. దానకర్మము ముగియఁగనే యావు సొంతగాఁడు దానిని తోలుకొనిపోవును. ఇట్టిపాపనిదానములు దానములా ? ఇట్టివిమనయింటి కెదుటనే జరుగుచున్నవికదా :–

అన్నదానవిషయములో నేమియు విచారింపఁ బనిలేదు. ఆఁకలిగొన్నవాఁడే యన్నదానమునకుఁ బాత్రుఁడు. ఆఁకలిగొనియడిగినపుడు మాలవానికైనను కుక్కకైనను అన్నముపెట్టవలయును. సంధ్య వేళ బిచ్చమునకు వచ్చినవాని కన్నములేదంటివేని వానిపాపము నీకిచ్చి నీ పుణ్యములువాఁడు తీసికొని పోవును. అటులని పగలంతయు కఱివేఁపాకు పూసలు లోనైన వమ్ముచు వ్యాపారముచేయుచు రాత్రిపూట బిచ్చమునకువచ్చి మాఱుగొంతుకలతో నఱచువారికి అన్నము లేదనిన దోషము లేదు. ఇట్టివారి కిచ్చుట చేన్యాయముగ నీయవలసిన బీదలకిచ్చుటకు లేకపోవును.

అన్నిదానములలో నన్నదానము శ్రేష్ఠము. అజ్ఞానికి జ్ఞానము కలుగునటులు చేయుట శ్రేష్ఠతరము. తరువాత కథ వినుము.

బ్రహ్మ–వీనికన్నిటికంటెను శ్రేష్ఠమయినది యేకాదశీవ్రతము. దానినిప్పుడు రుక్మాంగదుఁడనురాజు తాను జేయుటే కాక యందఱు ప్రజలచేతను జేయించుచున్నవాఁడు. ఆకారణమున నరులెవ్వరు నీలోకమునకు వచ్చిన వారు కారు.

యముఁడు:–అట్లైన నీదండము పాశము నాకేల ? మీ రిచ్చినది మీరే తీసికొనుఁడు. తేరకు నాకీమోఁత చేటేలా !

బ్రహ్మ:–ధర్మరాజా ! నీవు విచారపడకుము. నేనొక యుపాయము చేసెదను. దానివలన రాజు వ్రతము విడిచెనా నీపని మేలగును. నీ వింటికిఁ బొమ్ము.

అని ధర్మరాజును బంపి బ్రహ్మదేవుఁడు త్రిజగన్మోహినియైన మోహినియను నత్యంతసుందరిని సృష్టించిన నది పరమేష్ఠిం గని యిట్లనియె.

దేవా ! నన్ను సృష్టించినకారణం బెద్ది యానతిమ్మనిన సురజ్యేష్ఠుం డిట్లనియె.

సుందరీ ! నీవలన నొక మహాప్రయోజనంబు సాధింపఁగోరి భువనైక మోహినివగు నిన్ను సృష్టించితిని. నీ చక్కఁ దనము హొయలు నీటు చాకచక్యము స్త్రీస్వభావములయిన కపటము సాహసము లోనైనవన్నియు మెఱయఁ జని భూలోకము నిప్పుడు పాలించు రుక్మాంగదుఁ డను ధరాపాలుని మోహపరవశుఁజేసి నీ దాసునిఁగా జేసికొని యాయనచేయుచుండు హరివాసర వ్రతమునకు విఘ్న మాపాదింపుము.

ఆయన యత్యంత హరిభక్తుఁడు. సదాచారసంపన్నుఁడు నైష్ఠికుఁడు. ఆయన యేకాదశీవ్రతము నెడదె గక చేయుచు సమస్తలోకులచేఁ జేయించుటవలన నందఱు వైకుంఠమునకుఁ బోవుచున్నారు. యమలోకము పాడుపడుచున్నది కావున నీ వెట్టులైన హావభావవిలాసాదులను, కులుకులఁదళుకుబెళుకులను, మరుములుకుల కెనయై పచ్చకపురుపుఁ బలుకులఁబోలు బలుపలుకులను, గనుగిఱపులను, బొమలార్పులను, వాతెఱవిఱుపులను, చిఱనగవులను, నోరచూపులను, పైఁటసవరింపులను, నడబెడంగులను, తొడలకదలికలను, నతనిస్వాధీనపఱు చుకొని వ్రతమునకు భంగమొదవింపుము. చేఁపకీఁతనేర్పినట్టు లీటాటోటు విద్యలు స్త్రీవగు నీకు నేను నేర్పవలయు నా ? పోయి కార్యము సాధించి రమ్ము. అనిన మోహిని యిట్లనియె.

లోకేశ్వరా ! నన్నీ దారుణపాతకము నొనర్పనా సృజించితివి ? రుక్మాంగదుఁడు హరిభ క్తుఁడనిపుణ్య చారిత్రుఁ డని నీవే చెప్పితివి. అట్టివానిని జెఱుప యత్నించుట మహా ఘోరకర్మము కాదా ? ఇతరులు పాపకార్య ములు చేయుచుండ నట్టివారికి మతివచ్చునట్లు చేసి వారికార్యములు చెఱుపవచ్చును గాని పుణ్యకార్యములు చెఱుచుట వలన నాకెంతపాపము కలుగునో లోకమున నే నెంతదూఱుపడుదునో, నాకెంతటి యపకీర్తి శాశ్వ తముగ నిలుచునో యాలోచింపవైతివి. సకలభువనస్రష్టవు లోకపాలకుఁడ వవునగు నీవిట్టు లానతిచ్చుట తగదు. లోకులందఱు వైకుంఠమునకుఁ బోయిన నీకుఁగాని యమునకుఁగాని వచ్చిన నష్టమేమి ? ఆవిషయమై సంతోషపడుటకుమాఱు విచారపడునేల ? ఈ పాతకము నా మెడఁగట్టనేల ? నావంచనతెలిసి యతఁడు శపించిన నాగతియేమి ? నారాయణునకుఁ గోపమువచ్చిన నే నేగతిఁ బట్టుదును ? కావున నన్నొక సత్కా ర్యమునకు నియమింపుము. అట్టి స్థిరచిత్తుని మనస్సు చలింపఁ జేయుటయు నా కసాధ్యమే. ఎట్టి నీచవేశ్యయుఁ దన యొద్దకు వచ్చినవానిని జెఱుచునుగాని చెడనొల్లనివానిఁ జెఱపదు. అనిన నాకమలాసనఁజూచి కమలాసనుం డిట్లనియె.

తలోదరీ ! యిది దేవకార్యము. ఇందు నిన్నుఁ బాపము తొడరదు. కారణము చెప్పెద వినుము. రుక్మాం గదుఁడును భూలోక ప్రజలును మోక్షముగోరి హరివాసరవ్రతము నాచరించుచున్నారు. ఇది మంచికార్యమేకాని చెడుకార్యముగాదు. అయినను గొప్పపదవి నొకదాని నొకఁడాశించినపుడు దానికి వాఁడర్హుఁడగునా కాఁడాయని విచారించుట యాపదవిదాతకు విధికదా ? అయోగ్యులకు నుత్తమపదవు లియ్యరాదు. అపాత్రులకు దానమీయ రాదు అట్టు లిచ్చినయెడల నిచ్చినవారికిని బుచ్చుకొనినవారికిని గీడు మూఁడును, సానకు వేసినఁగాని వజ్రలక్ష ణము తెలియరానట్టు విఘ్నములు కీడులు కష్టములు కలిగించినఁగాని యొకని మనస్థైర్యము తెలియరాదు. ఎన్ని కష్టములుందును, ఎన్నివిఘ్నములు వచ్చినను దననియతి నెవడుమానఁడో యా దృఢచిత్తుఁడే యుత్తమపదవికి నర్హుఁడు. హరిశ్చంద్రుడు, ప్రహ్లాదుఁడు, విశ్వామిత్రుఁడు లోనగువారిచరిత్రములు స్మరింపుము. ఈవిధముగ నిప్పుడు రుక్మాంగదునిబరీక్షింపవలసియున్నది. అతని మనోదార్ఢ్య మెఱుంగవలయునని దేవతల యభిప్రాయము. నీమా యలకు లొంగక తనపట్టు మానక దృఢచిత్తుఁడై వ్రతము సలిపెనా మోక్ష మతనికిఁ గలతలామలకము. ఉద్దే శము చెడ్డదైననే పాపము వచ్చునుగాన మఱియొక విధమునరాదు. బాలురను దండించు తల్లిదండ్రులకును, దోషులను యథాశాస్త్రముగా దండించు న్యాయాధిపతులకును, దుష్టులశిక్షించు ప్రభువులకును, శస్త్రచికిత్సచేయు వైద్యులకును, దుష్టభావములేనప్పుడు పాపములేదు. నీ కీమార్గమే యనుసరణీయము. ఇదిపరీక్ష, విద్యార్థియోగ్యత తెలిసికొనఁగోరువాఁ డెట్లు కఠినముగఁ బరీక్షించునో యట్లునీవును బ్రవర్తింపవలయును. అప్పుడు నిన్నుదోష మంటదు. ఈనియతిని బట్టియేశ్రేయస్కరకార్యముల కనేకవిఘ్నములును, భక్తులకనేకాపదలను, పరిపక్వమగుచున్న చిత్తముగల వానికి దుష్టభార్యను, అవిధేయపుత్రులును, పాపపుబంధువులను, దేవతలు కలిగించుచుందురు. ఈరహ స్యము తెలిసిన విజ్ఞులు ఆపదలందు మఱింతధైర్యమువహించినియతిఁ బాయకుందురు. సంపదలందును మనస్సు భోగాసక్తము గానీక రాగద్వేషాదులకుఁ బాలుపఱుపక యిదియొక దైవకృతపరీక్ష యని యెంచి పరోపకారపారీణులై ప్రవర్తింతురు. అజ్ఞులాపదలందు దైవము దూఱుచు నీచకార్యములకుఁ బాలుపడుచు సంప దలందు భోగాసక్తులై మత్తులై యెదిరి సుఖదుఃఖము లెఱుఁగక పరపీడఁగావించుచుందురు.

రుక్మాంగదుని స్థైర్యము మాన్ప నాతరమా యంటివి. ఇది స్వశక్తి తెలియక పలికినపలుకుగాని యితరముగాదు. నీయట్టిదిట్ట చెప్పరాదు. స్త్రీలనఁగా మన్మథుడను జాలరిచేతిగాలములు. వానిచే మన్మథుఁడు పురుషులనుమీనములఁబట్టి విరహాగ్నియందు పండి భక్షించుచుండును. మదనాగ్ని యెంతవఱకు సంగములఁ బ్రజ్వలింపకుండునో యంతవఱకే పురుషుఁడు కులము శీలము వివేకము గలవాఁడై యుండును. ఎంతవఱకుఁ గామినీకటాక్ష వీక్షణములు సోఁకకుండునో యంతవఱకుఁ బురుషులమనస్సులందు వివేకదీపము వెలుగుండును. పాముకాటు విషమును విషవైద్యులు దింపఁగలరు. కాని వాలుగన్నులఁయన్నులకున్న వక్రదృష్టి యను సర్పము ముట్టెనా దానిని జక్యజేయు వైద్యులు లేరు. మందులు లేవు. ఎట్టిమొండి పిశాచమునైనఁ బాఱఁదోలు భూతవైద్యు లుగలరుగాని స్త్రీభూతముపట్టినవానిని స్వస్థచిత్తుఁ జేయు మాంత్రికులు లేరు. లోకమునఁ బురుషులకువచ్చుకష్టములు కెల్లస్త్రీలే కారణము. స్త్రీకంటె రమ్యవస్తువుగాని యంతకంటెఁ గష్టకారణము గాని వేఱొండులేదు. మన్మథబాణము లగుస్త్రీలు లేనిచో నెవ్వఁ డెన్నియవమానములైన సహించును నెన్ని కష్టములైన ననుభవించుచు నొక్కొక్కసారి కన్నీళ్లులోపలనేమ్రింగుచుయ గాళ్లుజోములు దిగనిలంబడుచుఁ గుక్కవలెఁ బరువెత్తుచు సన్న్యాసివలె వేళకుఁ గూడు నీళ్లులేక యల్లాడుచు, నధికారులపాదములు శిరస్సునధరించును? స్త్రీలవలని భయములేకుండినచో బుద్ధిమంతులు కొండలలోగుహలలో మనుజులు మిట్టాడనినట్టడవులలో వృక్షమూలముల నేలపడియుందురు ? స్త్రీయున్న యిల్లు పామున్న యిల్లు సమానములని కదా యోగులు గృహముల వదలిపోవుచున్నారు. ఏనుఁగు కుంభస్థలములను బగులఁగొట్టినవారు గలరు. సింహములతోఁ బోరాడినవారు గలరు. రణరంగమునలక్షలకొలది శత్రువుల నెదిరించి జయించినవారు గలరు. గాని స్త్రీకటాక్షముసోఁకి ధైర్యమును వదలనివారరుదు. కావుననే నిన్నీ కార్యమున నియమించితిని. ఇది యూర్వశీ రంభాతిలోత్తమాది దేవతా స్త్రీలకును సాధ్యముకాదనియెఱిఁగి వారికన్నమిన్నగ నిన్ను సృజించితిని. నీకుఁడోడుగ మన్మథుని మలయమారుతమును వసంతునిబంపెదఁ బొమ్ము. నీచమత్కారమంతయుఁ జూపి కార్యము సాధింపుము. అతఁడేనీకడకు వచ్చునట్లు చేసెద. అనిన నదియును నెట్ట కేల కియ్యకొని చేత వీణియుగొని చెలికత్తెలతోడఁ జక్క మందరపర్వతమునకుఁ బోయెను.

## రుక్మాంగదుఁడు వేఁట కరుగుట

తరువాతకార్య మాలోచించి బ్రహ్మదేవుఁడు నానా విధములైన వన్యమృగములను రుక్మాంగదు రాష్ట్ర మున సృష్టించెను. అవి విచ్చలవిడి యిచ్చవచ్చినట్లూరుపల్లెలు, గొడ్లుగోదలు, పైరుపచ్చులు, చెట్టుచేమలు,తోఁ టదొడ్లు, నాశముచేయ నారంభించెను. కాఁపులు లోనగుజనములరుదెంచి రాజునకుఁ దమగోడునంతయు విన్నవించిరి. రుక్మాంగదుఁడను దాను వేఁటాడి వానినెల్ల వధించెదఁబొండని వారికి ధైర్యము చెప్పి సమాధాన పఱిచి పంచెను.

రాజు వేఁటకై పోవుట విని సంధ్యావళి యరుదెంచి నిజవల్లభుఁగాంచి యిట్లనియె. ప్రాణేశ్వరా ! మీరు మృగయార్థ మడవులకుఁ బొవ నున్నారని వింటిని. ఆకార్యము మీయట్టివారు చేయఁదగినది కాదు. అహింసపరమధర్మమని వేదములు ఘోషించుచుండ ననేకజీవుల హింసింపఁదలఁచుట యకార్యముకదా? ఇట్టి చేయరానిపని మీ రెన్నఁడు చేసినవారు గారు.

తే. "వేఁట,జూదంబు, పానంబు,మాటబిరుసు
కఠినదండంబు,తరలాక్షి, కానియావి,
యనెడి వ్యసనంబు లేడింటియందు మమత
తగదు గావింప ధారిణీతలవిభుండు.

సీ. వేఁటఁ బాండుక్ష్మావిభుఁడు శాపము నొందె
ద్యూతసంగతి నైషదుండు నొగిలెఁ
బానంబునను యాదవానీక మిలఁగూలెఁ
కఠినదండమున మాగధుఁడు మేను దొఱంగె
భామినీరతి సింహబలుఁడు గెడసెఁ
దగని యావిఁద్రిశంకు ధరణి పాలసుతుండు
తలపోయరాని దుర్దశఁ జరించెఁ .

తే. గాన వ్యసనంబు లేడును గాని వగుట
యెఱిఁగి మనమున వానిలోనించుకైనఁ

దగు లొనర్పక నిల్చిన ధరణియెల్ల
నేలు నిష్కంటకముగ భూమీశ్వరుండు."

కలకాలము మీరిట్టి యవగుణములు గలవారై యుండిన నిప్పుడు నేను మిమ్మాక్షేపించి యుండను. తుమ్మెదలకు, ఎండ్రకాయలకుఁ, దేళ్లకు, వెదుళ్లకు అరిటిచెట్టునకు వినాశకాలముననే ఫలముద్భవించును. అట్టులే సాధువునందు విపరీతబుద్ధి యేదోకాఁగలకీడును సూచించును. అడవులు మృగరాష్ట్రములు మనరాష్ట్రముల మనలఁదిరుగనీయకహింసించుట యెట్టిదో వానిని హింసించుటయట్టిద కదా. నిర్భయముగ లేళ్లు చెట్టునీడలఁ బరుండి నెమరువేయుచు గొరిజలఁజెక్కిళ్లు గోకుకొనుచుండనిండు. మహిషములు జలాశయములఁ బొరలనిండు. అడవిపందు లిచ్చకొలఁది ముస్తెలఁదిన నిండు. నానావిధ పక్షులు మనోహరగానముల సంతోషపడునిండు. నిష్కారణముగ వీని నేల వధించెదరు ? ఒక వేళ క్రూరమృగములచే లోకులకుఁ బశువులకు బాధయగునేని వానిని మాత్రము వధింప వేఁటరుల నియమింపుడు. ఈపనికై మీ రేలపోవలయును ?

అనిన నామెకు రాజేవియో సమాధానవాక్యములు చెప్పి వేటకై వేఁటరులతోడ బయలుదేఱెను.

అట్లుపోయి యడవులఁబడి మృగవధఁ గావించుచుఁ జనిచని మందర పర్వతము సమీపించి యందొక ఋష్యాశ్రమంబుఁగని సేనలనెల్ల దూరమున నిలిపివిల్లెక్కుడించి వినీతవేషమున లోపలఁబ్రవేశించెను.

==========

## రుక్మాంగదుఁ డు వామదేవమహర్షిని దర్శించుట.

ఇట్లు ప్రవేశించి శరభాంగనల పాలుద్రావుసింగపుఁ గొదమలను, సింగపుఁ గొదమల బుజ్జగించు నేనుంగులును, నేనుఁగుల మేనులు గోకు పులులును తమనోటికండ నిడమెసఁగి చరించు చివ్వంగులును, చివ్వంగులతోడఁ గలసిమెలసినడయాడు గ్రామసింహములును, గ్రామసింహములపై బారిస్వారితీయు మార్జాలంబులును, మార్జాలంబులతోడఁ బాలుద్రావు పాములును, పాములు పడగలువిచ్చి యాడఁజూచి వినోదించు మూషకములును, నొక్క రేవున నీరుద్రావు పులులావులును, నెమళ్ల కెదురుద్దియై యాడు సర్పములును, గలిగి స్వభావజాతివై రంబు మఱచిభయ మెట్టిదో యెఱుఁగక వర్తించు మృగములఁగని మునిప్రభావమున కలరుచుఁబోయి పోయి యదివామదేవమహర్షి యాశ్రమమని యెఱిఁగి తనరాక శిష్యులచే నమ్మహాత్మున కెఱిఁగించి యనుజ్ఞ వడసి పోయి యమ్ముని పాదముల వ్రాలి నమస్కరించి నిలిచిన నాతపోధనుఁ డిట్లనియె.

నరేంద్రా ! యారోగ్యవంతుఁడవగు నిన్నుఁజూచి చాలసంతోషించితిని. నీభార్యలు, కోడుకు, కోడలు, చుట్టములు లెస్సయున్నవారుగదా ! రాజనుమాట సార్థకముగా ధరణిఁబాలించు చున్నావుగదా. రాజనువాఁడుండుట ప్రజల యోగక్షేమములు విచారించుట కేగాని తన కుక్షిని నించుటకును ఇష్టభోగైశ్వర్యము లనుభవించుటకును గాదని యెఱుఁగుదువుకదా ? భూమి గోవనియుఁ బ్రజలు లేగలనియుఁ దలఁతువు గదా ? పొదుగుకోసి పాలుత్రావినట్లు ప్రజలవలనఁ గప్పములదీయువు కదా ? సేవకుల యోగ్యతకుఁదగిన జీతము లిత్తువానీయొద్దకుఁ గొలువు చేయువారుకుటుంబరక్షణార్థము పరులయాచించు నట్టిస్థితియందుంచలేదు గదా ? నీకప్రియమైనను సత్యమైనదోషమును వెలిపుచ్చువారిపై ద్వేషింపవుకదా ? నీభటులు ప్రజలధనము తినువారు గావున వారిపట్ల సవినయముగ వర్తింతురు గదా ? అర్థకామములకుఁదల్లి ధర్మమేయనిధర్మము ననుష్ఠింతువు గదా ? నాలుగు వర్ణములవారును సంకరము లేక వారివారి వృత్తులయందు వారువావరున్నారా ? సర్వకార్యములకు శాస్త్రము ప్రమాణమని జనులు విశ్వసించ యున్నారుగదా ? శాస్త్రముల కపార్థములఁ గల్పించు నల్పపాండిత్యముగల కాపురుషుల నీరాష్ట్రమున లేరుగదా. శాస్త్రీయ వివాహవిధుల నుల్లంఘించుచు, కామ మణఁచుట యసాధ్యమనచుఁ గామము దీర నింద్రియములను విషయముల వెంట యథేచ్ఛముగఁ బోనిచ్చుచు నైహిక సుఖమేసుఖమనియు వాదించు స్వైరవిహారవాదులగు చండాలురు నీరాజ్యమునలేరు గదా ? నీవు హరిభక్తుఁడవు ధర్మైకతత్పరుఁడవనియునెఱుఁగుదురు. ఎన్నికష్టములువచ్చినను, దారిద్ర్యమువచ్చినను, భార్యచచ్చినను, బిడ్డలు పోయినను దుఃములుముసిరినను, అన్నదమ్ములు ద్వేషించినను, బంధువులు పగగొనినను, హరిభక్తియుధర్మబుద్ధియు మానకుము. పెండ్లాముబిడ్డలు, ఇండ్లు, పశువులు, పూర్వజన్మ ఋణాను బంధమునఁ గలుగుచు నది తీఱినపోవుచునుండును. ఇవే యిట్టులైన నిఁక చుట్టమూలమాట చెప్పనేల ? చుట్టాలు దొంగలనుభాగవత వాక్యము సత్యమని నమ్ముము. నీమీఁ ప్రీతిచే నీకుసహాయ్యముచేయ నీయొద్దకు చుట్టములు వత్తురని నమ్మితివేని నీకంటెభ్రాంతుఁడు మూఢుఁడు లోకమున లేడు. అందఱు ధన దాసులనియు దానినిమిత్తమై నీయొద్దకు వత్తురనియు తూనికలోఁ గొంచెముఁ కొలఁతలోఁ గొంచెము, కలహించి కొంచెము, మాటాడకయే కొంచెము, న్యాయముగాఁ గొంచెము, మోసగించి కొంచెము, కొంచెముకొంచెముగానే సర్వము హరించు చెదు కోమటివలెనే చుట్టములు కని కొంత, కానక కొంత, యడిగికొంత, యడుగక కొంత, యపహరింతురనియు నమ్ముము. వారియందు నీవెంతవిశ్వాసముంచి వారి యిష్టప్రకారము చరించుచు వారినిదలపైఁ బెట్టికొని దేవు

నివలెఁ జూచినను పాపభీతులుతప్పఁ దక్కిన చుట్టములు వారిదొంగచేష్టలు వారుమానరు. పై పెచ్చు లేని నిందలు నీపై మోపి కనుమఱుఁగున దూషించి యగడు చేయుదురు. నీవు సంపాదించిన ధన మింటిలోనే నిలిచిపోవును. బంధువులు స్మశానమువఱకు వచ్చిన వత్తురు నీవుచేసినపుణ్యపాపములు మాత్రమే నీవెంటవచ్చును. కావున నెన్నికష్టములు వచ్చినను బుణ్యకార్యము చేయుట మానకుము. నీమనస్సుపరీక్షించుటకయియే భగవంతుఁడు నీకుఁ గష్టములు కలిగించును. కావున నీవు వానికి భయపడరాదు. ధనము పరమార్థమని నమ్మకుము. ధనవంతుఁడు పీనుఁగుతో సమానుడు. పీనుఁగును బీఁకితినుటకై మూఁగిన కాకులు గ్రద్దలు నక్కలు కుక్కలు తమలోఁదాము కలహించునట్లు ధనవంతుని యాలివంకవారును తల్లివంకవారునుదండ్రివంకవారును బరస్పరముకలహించుచు వాని బాధించుచుందురు. ఒకని కిరువురు భార్యలు గలరు. అందు నొకతె వయసుది. మఱియొకతె యింతకంటెఁ బెద్దది. వారిభర్త సగము నరసినవెండ్రుకలవాఁడు. ఒకనాఁడు చిన్న బార్య మగనినిజూచి నీతలలోఁ దెల్లవెండ్రుకలున్నచో నామగఁడు ముసలివాఁడని నాసరివారు నన్నుఁ బరిహాసముచేయుచున్నారు. అని తెల్ల వెండ్రుకలన్నియు నూడఁబెఱికెను. పెద్దభార్య యదిచూచి ఆహా! నీవు తెల్లవెండ్రుకలూడఁబెఱికిన నేను నల్లనివెండ్రుకల నుండనిత్తునా యని యది నల్లని వెండ్రుకలనెల్లఁ బీఁకి వైచెను. కావునఁ గేవలము ధనమే పరమార్థమని నమ్మకుము. సోపాధికులైన బాంధవులును ప్రతిబంధములు గావున వారు నిన్నుఁ దరింపఁ జేయుదురని నమ్మకుము. భగవంతుఁ డగు శ్రీమన్నారాయణుఁడే శరణని నమ్మియుండుము. ఎన్నికష్టములు వచ్చినను భగవద్ధ్యానముమానకుము. బురదకుమ్మరపురుఁ గు, తామరపాకునీటిబొట్టులు, గ్రచ్చకాయ, బూడిద, నాలుక, జిడ్లువలె సంసారమున నంటీయంటక యుండుము. స్త్రీలకుమాత్ర మెన్నఁడును వశపడకుము. అనిన రాజిట్లనియె. మునీంద్రా ! సంసార మను బురదగుంటలో దిగఁబడియుండువానికి విషయములపై మనస్సు పోకుండుటెట్టు ? అది యసాధ్యకార్యమని తోఁచుచున్నది. అనిన వాసుదేవుఁడిట్లనియె.

రుక్మాంగదా ! నీ విట్లనరాదు. దృఢమనస్కునకు నసాధ్యమేదియునులేదు. బంధమునకు మోక్షమునకు మనస్సేకారణము, భగవంతునిపై మనస్సుంచితివా నీవు సంసారమందుండినను నీకు బాధలేదు. సంసారమున మనస్సుంచితివా నీకు భగవంతుఁడు మఱుఁగుపడును. సంసారమునం దుండియు భగవంతునిపై మనస్సు నిలిపినవానికి వాఁడు చేయుకర్మములు బాధింపవనుట కొకకథ చెప్పెద వినుము. మునుపు మహాకర్మయోగియైన జనకమహారాజునొద్దకు నొక బ్రాహ్మణుఁడువచ్చి నీవడిగినట్ట యడిగెను. అప్పుడాయన కేమియు నుత్తరము చెప్పక యూరకుండి జనకుఁడు మఱునాడు పెద్దపళ్లెరమునిండఁ బాదరసముపోసి యాబ్రాహ్మణుని తలపై నుంచి యిట్లనియె.

ఓయీ ! నీవీపళ్లెరమును మోచికొని యూరంయుఁ దిరిగి రావలయును. ఈపాదరసములో నొక బొట్టైనను చింది పడెనా వెంటనే యీ నాభటులు నీశిరస్సు ఛేదింతురు. ఇది రాజాజ్ఞ సుమా. అనిచెప్పి భయంకరులైన నలువురుభటులఁబిలిచి యో కింకరులారా ! మీరీ బ్రాహ్మణకుమారువెంటఁబొండు. ఎందైనను బాదరసము నేలఁజిందెనా వీనితల యాస్థలమందే నఱికివైపుఁడు" అని యాజ్ఞాపించి పంపెను. బ్రాహ్మణకుమారుఁడు రాజా నేనేమి యపరాధము చేసితిని ! నాకేల యిట్టిశిక్ష ? యని వేఁడుకొనెను. గాని జనకుఁడు వినినవాఁడుకాఁడు. మఱింత కోపించెను. వేఱుమార్గము లేక యా విప్రబాలుఁడా పళ్లెరము తలమీఁదనుంచుకొనియెక్కడఁ బాదరసము తొనఁకునో యనుభయమున మనస్సంతయుదానిమీఁద నేయుంచి యడుగులో నడుగిడుచు వీథులవెంటఁ బోవుచుండెను.

అతని నటులు పోనిచ్చి రాజు మంత్రులఁబిలిచి యాబ్రాహ్మణ కుమారుఁడు మరలివచ్చువఱకు వీధివీధియందు నాటోపాటో మఱియేదో యొకవినోదము జరుగుచుండునటు లేర్పాటు చేయుఁడని పనిచెను. వారునట్టులే చేసిరి. మూఁడునాలుగు జాములుకాల మాబ్రాహ్మణుఁడూరంతయుఁ దిరిగి మరలి జనకునింటికి వచ్చెను.

అప్పుడు జనకుఁడాయనను సమ్మానించి యిట్లనియె. "బ్రాహ్మణోత్తమా ! నాయూరంతయుఁ దిరిగివచ్చితివికదా. ఏ యే వీధియం దేయేవింతలు చూచితివి. నాకువివరించి చెప్పుము" అని యడిగిన నతడిట్లు చెప్పెను. 'రాజేంద్రా ! తల మీఁద పళ్లెరము ఎక్కడ కదలునో పాదరస మెందుఁజిందునో యను భయముకే నా మనస్సు దానియందే యుండటచే నేను వినోదములందు దేనినిజూడలేదు.

రాజు-నీవు బాట వెంటఁ గన్నులుమూసికొని పోయితివా ?

బ్రాహ్మ-లేదు. నామనస్సువినోదములందుఁబోలేదు కావునఁ గన్నులు చెవులు మూసికొనకయుండినను నాకేదియుగోచరింపలేదు.

జన-నీవడిగినప్రశ్న కిదియే యుత్తరము. మనస్సంతయు భగవంతునందు నుండునేని నీవుకార్యము చేసియుఁజేయని వాఁడవే. గావున సర్వదా భగవంతునిధ్యానించుచునే యేకార్యమైనఁ జేయుము. అని బోధించెను.

రాజా! యిదియట్టులుండనిమ్ము. నీయట్టివాఁడు ఘోరహింసారూపకమైన వేఁటయందు మనస్సు పోనీ యవచ్చునా ? అది సప్తవ్యసనములలో నొకటి యని యెఱుఁగవా ? అహింసయెట్లు పరమధర్మమోహింసియట్లు పరమాధర్మము కదా. అన్ని వ్యసనములలో మహాఘోరమై పురుషుని నిహపరములందు భ్రష్టునిఁ జేయునది. స్త్రీ వ్యసనము. మగువలమరగినవానికిహముపరమురెండును లేవు కావున నిఁకమీఁదనైన నీవు వ్యసనములకుఁ బాలుపడకుము. ఒక వేళ ఁ గర్మవశమున నట్లు పాలుపడితి వేని వాల్మీకిచరిత్రము మనస్సుననుంచుకొని భగ వన్నామము స్మరించుచు భగవత్కైంకర్యము చేయుచుంటివేనినిన్నుభగవంతుఁడు రక్షించును. నీవు హరివాసర వ్రతము చక్కఁగా జరుపుచున్నాఁడ వని విని చాల సంతోషించితిని. ఏకారణముననైన దాని వదలెదవుసుమా." అని త్రికాలవేదియగు నమ్మహర్షి జరగఁగల కార్యమెఱిఁగి యాయనమనస్సు దృఢపఱిచి పంపెను.

రుక్మాంగదుఁడును ముని యనుజ్ఞపడసి యచ్చోటు విడిచిచని యాపర్వతము సౌందర్యము కచ్చెరుపడు చు దానిమీఁది కింజని యిచ్ఛావిహారము గావించుచుండె. అప్పుడా రాజపురందరునకు వీనులవిందై డెందం బున నమందానందంబు కందళింపఁ జేయునొకగానంబు వినవచ్చెను. విజనమైన యీవనమున నిట్టి మనోహ రగాంధర్వమెసఁగించువారెవరని యచ్చెరువుపడి యాపుడమిపతి యానాద మరుదెంచు జాడఁబట్టిపోవఁబోవ నందు ఘమ్మని కమ్మతావుల వెల్లువలహల్లోహలమ్ములగు తుమ్మెదల ఝుంకారమ్ములను, ఒగరుచిగురుల మెసఁ గి రాపెక్కి నకంఠములఁ గుహూకారము లొనర్చుకోయిలలను, వసంతలక్ష్మికిఁగై సేయఁ గొమ్మలమరిచిన పూలబుట్టలవలె నుండు వృక్షమ్ములను జూచుచుఁబోయి యందొకచో నొక శివాలయముఁగాంచె.

ఇట్లు కాంచి లోనఁ జన నందొక స్త్రీ

సీ. "తతనితంబా భోగధవ శాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగు వలన
శశికాంతమణీపీఠి జాజువాఱగఁ గాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూతతంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ బొక్కి యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ

గీ. బ్రౌఢిఁ బలికించుగీతప్రబంధములకుఁ
గమ్రకరపంకరుహరత్న కటకఝుణఝు
ణధ్వనిస్ఫూర్తి తాలమానములు గాఁగ
నింపుదళుకొత్త వీణ వాయించుచుండె "

ఆ యింతి దేహకాంతియు, మిటారినీటును, హొయలాడి యొయ్యారంబును, గుందరదనచక్కదనంబును కులుకులాడి తళుకు బెళుకులును, కలకంఠి పలుకులును గనివిని మోహవశంబునఁబబ్బిబ్బులై మైమఱచి చిత్తరుబొమ్మవలె ఱాతివిగ్రహము వలె నిశ్చేష్టుఁడై నిలిచి ఱెప్పపెట్టక తుమ్మెదరెక్కలను ఇంద్రనీలములను గొలి చిన కురులను, గందు లేని యిందుబింబముకుందు పఱుచు వదనారవిందమును, జగములగెలువ రతిమన్మథు లొక్కటనెత్తినవింట్లను బోలు కనుబొమ్మలను, తమ్ముల, మీనములఁ, జకోరములఁ, గువలయమ్ముల నుల్లసమా డునేత్రమ్ములను, నూవుఁబూవును సంపెఁగ మొగ్గను నెగులాడునాసికను, ముత్తెమ్ముల చాలును దానిమ్మగింజ లను, మొల్లమొగ్గలను సిగ్గుదీయు పల్వరుసను, కెంపుదొండపండు పవడంబుడంబు హరించుచు నమృతంబు బావియగు మోవియు, చక్కిలములను శ్రీకారమును తొమ్మిదిని దిమ్ము నదలించు వీనులను, జూచి చూచి కొంత వడికిఁ దెప్పిఱి తనలోఁ దానిట్లు తలపోయఁ దొడఁగును.

సీ. "మించి దృష్టికి మిట్లు గొల్పెడునిది
తెలియఁ గారుమెఱుంగుఁదీఁగెయే మొ
కార్మెఱుంగునకిట్టి కళ గలదే యిది
సొబ గైనవెన్నెలసోగ యే మొ
వెన్నెలసోగ కీచిన్నె లున్న వె యిది
మరునిరాచిల్క సాంబ్రాణి యే మొ
చిలుకసాంబ్రాణి కీచెలువంపునడలుండు
నాయిది కలికిరాయంచ యేమొ

తే. కలికిరాయంచ కీసోయగంబు గలదె
యెమ్మె గల దిది జాళువాబొమ్మ యే మొ
జాళువాబొమ్మ కీవిలాసములు గలవె
మెచ్చునగునచ్చరవెలందిమిన్న యే మొ

అని నిబ్బరంబు పట్టఁజాలక యాబిబ్బోక వతిని డాయనరిగె. రాజు రాకకై వేచియుండు చకోరిఁబోలు నాయింతియు రాజ రాకం గాంచి కాలియందెలు కరకంకణములు మొననూలి మువ్వలు రవళింపఁ జి వాలు వ లేచి ముచ్చుసిగ్గు నటించుచుఁ దలవంచి నిలుచుండెను.

రాజు దానిం గదిసి చెలువా ! నీ వెవ్వ తెవు? అచ్చరమచ్చెకంటివా ? విద్యాదరబింబాధరవా ? మానవ భామినివా? పన్నగులవన్నెలాఁడివా ? గంధర్వసుందరివా చెప్పుము. ఇందేలయున్నదానవు ? నీపేరేమి ? నీ భర్తయెవ్వఁడు ? ఊరెద్దియనిన నామధురాలాప యిట్లనియె.

రాజేంద్రా ! నేను వేలుపుఁ గన్నియను : నాపేరు మోహిని, విలాసార్థమిందు సంచరించుచున్నదానను. అనిన రాజు దానితోఁ దనయభిప్రాయముఁ దెలిపి తన్ను భర్తగఁ గైకొనుమని కోరిన నది యిట్లనియె.

మోహి-ఓయీ! నీకులశీలంబులు స్థితిగతులు తెలియక నిన్నెట్లు నేను వరింపఁ గలను? నీకుఁ బెండ్లా ము బిడ్డలు లేరా? ఉండి రేని నన్నేల నీవాసించెదవు ?

రాజు-కామినీ ! నేను సూర్యవంశసంభవుఁడను సత్యవ్రతనిష్ఠుఁడను. ఆడితప్పువాఁడనుగాను. నాకు భార్యలు నూర్వురు గలరు. నాపట్టపుఁ దేవికిఁ గొమారుఁడునుగలడు. ఎందరుండిన నేమి? నిన్నుఁజూచినప్పటి నుండి నామనస్సు నీయందునాటియున్నది. మోహినియను పేరునీకు సార్థకము. నాయందునుగ్రహించి నన్నేలుము. పేరరుక్మాంగదుఁడను.

మోహిని-నూర్వురు భార్యలు గలనీవునన్నేమియాదరింతువు? పెద్దభార్యకుఁ గొడుకును గలఁ డంటివి. కనువేఁదురున నక్కఱపడి మక్కువగలవానివలెఁ గక్కుఱితిపలుకులు పలికెదవు గాని నీయక్కఱ చక్కఁబడిన వెనుక నా ప్రక్కమోమైననెత్తి చూతువా? అటైన సరివారిలో నాబవిసాటిపోదా ? సరసరిపోపొమ్ము. నీసాంగత్యము నే నొల్ల.

రాజు-కలకంఠీ ! యట్లులనకుము నేఁడు మొదలు నీతోఁ దప్ప నేనేయితర స్త్రీతోనైనను సంభోగింప నని ప్రమాణము చేసెదను. నేను నాభార్యలు కొడుకు నీవారని యెంచుకొనుము. నేను నావారు సర్వరాజ్యము నీసొమ్ముగ గ్రహించి యిచ్చవచ్చినట్లు పనిగొమ్ము. నిన్నేనాఁడును నవమానింపను. నీకువశుఁడై యుందును. భగ వంతునికెదురుగఁ జెప్పుచున్నాను నమ్ముము.

మోహిని-నన్ను విడనాడకుందువు కదా ? తప్పవుకదా ?

రాజు-మూఁటికి ముమ్మాటికిఁ దప్పను. అని ప్రమాణముచేసి చెలిక త్తెలతోడ మోహినిని దోడుకొని కొండదిగివచ్చి సేనలం గలసికొని యయోధ్యకుఁ బయనించెను.

ఇట్లు సన్నాహంబునఁ దనగుఱ్ఱము నెక్కఁబోవు సమయమున దానిగిట్ట తాఁకువ దేహముగాయపడి బాధపడుచుండు బల్లిని జూచి దయాళుండైననృపాలుండు తటాలున దాని నెత్తికొని చల్లనినీళ్ల కడిగి మెల్లగఁ జిగురుఁగొమ్మలపై విసరెను.

బల్లి కింతయుపచారముఁజేయు రుక్మాంగదుఁజూచి మోహిని యిట్లనియె. రాజా ! నీవెంత వెఱ్ఱివాఁడవు పనిలేని సోమరివలె వర్తించుచున్నావు బల్లికై యింతపాటుపడెదవేల ? ఈడ్చి యావలఁ బాఱవేయుము. చచ్చినఁ జావనీ బ్రతికిన బ్రతకనీ. బల్లిని దాఁగినస్నానముచేయవలయునని, తెలియదా ? యనిన నింతలో నాబల్లియుఁ దెప్పిఱి ప్రారబ్ధము పరిపక్వమగుటచేఁ బూర్వజన్మజ్ఞానము కలదై మోహినితో నిట్లనియె.

ఓసీ ! నీలంజెతనపుఁ జేష్టలుమాన నీవశమా ? గొప్పవారితోఁ జేరినను నీచులు తమ నీచగుణమును బాయఁజాలరు. పన్నీరుపోసి పెంచినను నీరుల్లి తనకంపును విడవదు. బల్లియని నన్నవమానదృష్టిఁ జూచితివి గాని బ్రహ్మమొదలు స్తంబపర్యంతము దేహములన్నిటికిఁ గర్మానుభవయోగ్యమైన శరీరలక్షణములందుఁ దార తమ్యమే కాని వేఱు తారతమ్యములేదు. దేవతాస్త్రీవైన నీకును పురువు నైన నాకును దేనియందు భేదముగలదో చెప్పుము. మన మిరువురము పంచీకరణము చేనైనవారమేకదా కావున దేహములన్నియుఁ బంచభూతములచే నైనవనియు నాత్మలన్నియు నొకటే యనియు నీవెఱుఁగజాలవైతివికదా ? నాకిట్టిగతిపచ్చుటకుఁ గారణము చెప్పెద వినుము.

ధనికులు పేదలందును బలవంతులు బలహీనులయందును గొప్పవారు కొలఁదివారియందును దయ తలఁచుట యుత్తమము గాని కరుణమాలి గర్వించి తిరుగుట యుత్తమలక్షణముగాదు. సర్వము భగవన్మయమను

జ్ఞానముగలవారు దేనిని నీచదృష్టిని జూడరు. ఇతరులకుఁ గీడు రోయరు. వారువారు చేసిన పుణ్యపాపములకొలఁది నుత్తమజన్మమోయధమజన్మమోలభించును. ఉత్తమజన్మమునందినవారు తాము పూర్వజన్మమునఁ జేసిన పుణ్యముచే నిట్టిజన్మములభించెఁగదా యనుజ్ఞానముగలవారై పుణ్యకార్యములందే యాసక్తులుగావలయును. అటుకారేని మరలనధమజన్మముల పాలగుదురు. అధములు తాము చేసిన పాపముచేఁ దమకట్టిజన్మము లభించెనని యెఱిఁగి పాపకార్యములు చేయక శక్తికొలఁది పుణ్యకార్యములే చేయువలయును. పరోపకారముతో సమానమైన పుణ్యముగానిపరాపకారముతో సమానమైన పాపముగాని లేదు.

చం. కరుణమీరుపుణ్య. మధికారముఁబోలెడి నాపదల్ ! హరి
స్మరణము మీఱుతీర్థము. ప్రజాపరిపాలన మీఱయజ్ఞముల్
విరహముఁ బోలు రోగము,వివేకముఁ బోలు విభూషణంబు. మ
చ్ఛ రమును బోలుదుర్గుణము. చంద్రనిభానన ! కల్గనేర్చునే ?
ఓసీ ! నేను బూర్వజన్మమునఁ గాంపిల్యనగరమున నొక

బ్రాహ్మణ కుమారితనై జనించితిని. నాతండ్రి నన్నుఁ దగిన వరునకిచ్చి వివాహముఁ గావించెను. నాపతియే నాకుదైవమని తలఁచి సర్వవిధముల భర్తసేవ చేయుచుంటిని. ఇట్లుండఁ గొన్ని నాళ్లకు నావిభుఁడు వేఱొకతరు ణిని మరగి నన్నొల్లక తిరుగుచుండెను. అట్లుండినను నే నతనియెడఁ బ్రీతిఁ బాసినదానఁగాను. నాయందుమరలనాభర్తకుఁ బ్రీతి యుదయింపవలయునని యెన్నెన్ని దైవములకో మ్రొక్కితిని. జోస్యముచెప్పుఁడని బ్రాహ్మణులనడిగితిని. ఇరుగుపొరుగు మిద్దెలపైఁ బోచిళ్లుచల్లితిని. ప్రశ్నలకుఁ బోయితిని. సాముద్రికము విచారించితిని. బిచ్చమునకైవచ్చుబడుగు జోగిజంగాలఁ బూజించి తిని. బలులిచ్చితిని. పెద్దవీటిగొల్లల సేవించితిని. ఇంతచేసియు నాపాపమేమోనామీఁదనాపతికి దయరాదాయెను. ఇట్లుండ నొకనాఁడు విబూది మేననిండారఁ బూసి పచ్చబొంత ఱొమ్ములపైగుదురు పఱిచి చెవులలోఁ దెల్లనివెండ్రుకలును చేతనొక యోగదండము మెడలో సంకుపూస పేరులు కలదైయొక జోగురాలువచ్చెను. నాకుఁ బతిపై నుండుప్రీతియుఁబతి నన్నొల్లకుండుటయుదానిఁతో జెప్పి మాయిరువురకు సంఘటనంబగు నుపాయము చెప్పుమని ప్రార్థించితిని.

అది యెంతమాత్రమని యా చండాలవుముండ యొక మందిచ్చి యిది నీ పెనిమిటికి నన్నములోనో,పాలలోనో తాంబూలములోనో పిండివంటలోనో పెట్టి యిమ్ము. ఇది యతఁడు తలంటుకొను నూనెలోవేయుము అని చెప్పెను. నే నట్లే కావించితిని దానిచే నామగఁడు మతిభ్రమకలవాడయ్యెను. మందమతి మయ్యెను. దేహము శుష్కింపసాగెను. ఎదురుఱొమ్ము ఎండిపోనఁ జొచ్చెను. అన్నము రుచింపదయ్యెను. దేహమున బొబ్బలెక్కి మంచమెక్కి కృశించి తుదకుఁ జావనేచచ్చెను. ఏనుఁగు తన నెత్తిపైఁ దానే మన్ను వేసికొన్నట్టు నా నెత్తిపై నేనే మన్ను పోసికొని విధవనై లోకనిందలఁ బడి నేను మతిమాలి చేసినపాపమునకై శోకించి నికృష్టపుఁజావు చచ్చితిని. నేను దానికై పడిన నరక బాధ యేమని చెప్పుదును. యమకింకరుల నాచే వేలకొలఁది బల్లులను దినిపించిరి. తొండలు నమలించిరి. విషముమ్రింగించిరి. సలసల క్రాఁగుసీసము నానోరఁబోసిరి. కూడు నీరు పెట్టక శుష్కింపఁజేసిరి. నానోరఁగింకరులు పోసిన మూత్ర మెన్ని నదులగునో ? ఇట్లు పెక్కువేల సంవత్సరములు నరకయాతనలను భవించినపదపడి నన్ను బ్రహ్మ దేవుఁడుచూచి యిట్లనియె.

ఓసీ ! నీ వెంతయుఁ బతిభక్తి గలదానవయ్యు తెలియక మగనికి మందుపెట్టితివి. కొన్నిపదార్థములు మనుష్యమూత్రముతో నూరి బల్లిమాంసముతోఁగలిపి యా పెట్టుమందుచేయఁబడినది. అట్టిది నీవు నీమగనికిఁ బెట్టుటచే పతిద్రోహము,విశ్వాసద్రోహము చేసినదానవైతివి. దానిచే నీమగఁడు నానారోగముల పాలై కృశించి చచ్చెను. కావున నీవు బల్లివై పుట్టుము. తెలియక చేసితివి గావున నీకుఁ బూర్వజన్మజ్ఞానము కలుగును. రుక్మాంగదుఁడు హరిభక్తుడు. అతఁడు తాఁకినంతట నీకాజన్మము పోయి యుత్తమజన్మముగలదానవై మరలమగనితోడ సుఖింతువు. నీవుచేసినదాపాపమొకటియే యగుట నీయందు దయతలఁచితరుణోపాయము కల్పించితినని చెప్పెను. నేనును బల్లినై పుట్టి యీయడవుల నల్లాడుచుండి యిప్పు డీ పుణ్యాత్మువలనఁ బాపము క్షనైతిని.

తే. "మాలకరి, దాసి, సైరంధ్రి, మాఱుతల్లి,
మగఁడు విడిచినసతి,దూతి, మంత్రసాని
జోగురా,లాకులమ్మెడిజోటి,విధవఁ
గలసి వర్తించునది జారగా నెఱుంగు.

అని యిట్టివారి సహవాసము చేయరాదని తెలిసి చేసిన ఫల మిట్లనుభవించితిని. పరోపకారమున కడ్డపడు నిన్ను యముఁడుసైరించునా?రాజా!నీవు కష్టపడవలసిన వ్రాతయుండి దీనివలలోఁబడితివి. హెచ్చరికసుమా.

అని చెప్పి యది బల్లి రూపమునూనిదివ్యరూపముధరించి రుక్మాంగదునకు నమస్కరించి యథేచ్ఛ మరిగె. రుక్మాంగదుండును మోహినిం దోడ్కొని యయోధ్య కరుదెంచి యంతఃపురంబు ప్రవేశించి భార్యల నెల్ల రావించి మోహినిం జూపి యిట్లనియె.

సతులారా ! యిది యప్సరోజాతిదేవతా స్త్రీ, దీనినాభార్యఁగా బరిగ్రహించితిని. దీనితోడఁదప్పఁదక్కిన స్త్రీలతో రమింపనని బాసచేసితిని. నాసత్యమును మీరురక్షింపవలయును. అని చెప్పిన వారెల్ల నానృపాలుని వెల్లంబోయిన మోములతో బ్రణయకోపముతో నిట్లనిరి.

ప్రాణేశ్వర ! నీయట్టివాఁడు పలుకవలసిన పలుకులా యివి. నీయాచారము. వివేకము, జ్ఞానము, భక్తి, యేయేటివెంటఁబోయెను? మా యిందఱకంటెను నీపట్టపుదేవికంటెను ఈ పడుపుఁబడంతి యేమియంత యందగత్తె? మాయందు లేని విశేషము దీనియందేమి కంటివి ? నీయట్టివాఁడు కామదాసుఁడు కామినీదాసుఁ డు నగుటయేగాక వారకామినీ దాసుఁడు నగుట సంభవించిన నిఁక ననుకొనవలసిన దేమున్నది? వారస్త్రీసాంగ త్య మేశాస్త్రములఁ జెప్పఁబడినది ? పశువులతోను వేశ్యలతోను సంగమించువాఁడు ప్రాజాపత్యవ్రత మాచరింప నలయునను శాస్త్రోక్తి మఱచితివా ? యథారాజా తథా ప్రజా యని నినుఁ జూచి లోకులును జెడిపోవుదు రని నీకు స్ఫురింపలేదా ? మాతోనిఁక సంగమింపనంటివి. మాఋతుకాలము వ్యర్థపఱిచినఁగలుగుభ్రూణహత్యా పాతకము నెట్లు తప్పించుకొనగలవు ! ఇదిమనుష్యజాతి వేశ్య కాదంటివి. ఎవతెయైననేమి? వేశ్యవేశ్యయే. విశ్వా మిత్రునొద్దకు మేనక యేలవచ్చెనో ఏమిచేసిపోయెనో యెఱుగవా ! ఊర్వశి పురూరవు నేగతిఁబట్టించెనో మఱచి తివా ? జారులు చోరులు దురాచారులు, చేటకులు, లోనగు నీచులయెంలిగియుమ్మికిమూకుడై న లంజపెదవిని యాత్మగౌరవముకులగౌరవము సదాచారము పాపభయము గలవాఁడెవ్వఁడు ముద్దిడును?

చం. విడువక పుట్టుగ్రుడ్డునకు, వృద్ధశరీరికి, గుష్ఠరోగికిన్
జడునకు, జాతిహీనునకు, జారునిజాంగములొ క్కరూకకై ।
కుడువడి నిచ్చువారిగుణకల్పలత ల్విదళించుకత్తులం
బడుపుఁబడంతులందనదుభావముఁ జేర్చునె యెవ్వఁడేనియు॥

తమ ప్రయోజనము మదిఁగోరి వారస్త్రీలు సమయము కొలఁది నవ్వుదురు. వగ లేడ్పు లేడ్తురు. పురు షులను నమ్మింతురు. గానితాము వారిని నమ్మరు. కావునఁ గుణశీల సమన్వితుఁడైన నరుఁడు వేశ్యలను స్మశా నసుమముల వలె వర్జింప వలయును అనుసూక్తి మఱచితివా !

కులాంగనా సంగమము నీకేల హేయమయ్యె ?
ఉ. ఆది మితారతంబు తదనంతర మంచితరాగమంతల !
జ్జోదయ మైనరమ్య శిథిలోద్యమ మంత నితాంతధైర్యవి !
చ్ఛేదము ప్రేమపూరము విశేష వివిక్తవిహారమంతనా !
హ్లాదకరాంగసంగము కులప్రమదారత మల్ప సౌఖ్యమే .

నిజము నిజము రాజా ! అర్థాశయుఁ గపటస్నేహము, దొగయేడ్పులు, అసత్యవాక్యముల మనస్సురంజిం పఁ జేయుట, వీనిలో నొక్కటైన మాయందు లేదే మేమెట్లు వేశ్యతో సమానలము కాఁగలము ? కొండపైఁ జాఁ ప రాతిమీఁద తామర మొలచునా ? గుఱ్ఱమువలె గాడిద పరుగు పాఱునా ? బియ్యపుగింజలు చల్లిన పరిపైరు మొలచునా? సిగ్గు విడిచిన లంజమనస్సులో ననురాగముండునా ! బంగారములు హారములు రత్నములు వీనిచే సంతోషించునది వేశ్యప్రేమకోమలములైన కటాక్షవీక్షణములచే సంతోషించునది యిల్లాలు. ఇట్టి మగనాలినివిడిచి గయ్యాళిలంజల మరగినవారి నేమనవచ్చును?

అని భర్తను బరుషంబు లాడుచున్న సవతులంజూచి సంధ్యావళి యిట్లనియె.

అక్కలారా ? భర్త నిట్లు నిష్ఠురములాడుట మీయట్టి సాధ్వులకుఁ దగవుకాదు. పతి యీసతిని వరింపక ముందు మన మెన్నియైనఁ జెప్పియుండవచ్చును. కడచినకార్యమునకై వగచిప్రయోజనమేమి ? మీరసత్యము చెప్పితిరనికాని రాజు మంచి కార్యము చేసెనని కాని నేను జెప్పనుగాని నీరంతయుఁ బోయిన పిమ్మట నేటికి ఆనకట్ట కట్టుటయేల ? పరుషవాక్యములచేఁ బతి మనస్సు నొవ్వఁ జేసిన రాఁగలలాభ మేమి ?అటుచేయుట పతి వ్రతాలక్షణముగాదు. కఠనోక్తుల నెట్టివారిమనస్సైన నొవ్వఁజేయుటహింసయగు చుండనే కారణముననైన నేమిభర్తమనస్సు నొప్పించుట యతని హింసించుటేకదా ? క్రొత్తయొక వింత వేఁడియొకరుచియన్నట్టు లీ రాజునకు దీనిపైనీవల పెన్నాళ్లుండునో చూతము. రాజులు నూతనప్రియులుగదా ? కావున మనము సహించుట మేలు. అని యందఱసమాధానపఱిచి వారివారి గృహంబులకుఁ బనిచి రాజాజ్ఞగొనితానును దనయంతఃపురం బున కరిగె.

అంత రాజును మోహసముద్రమున మునిఁగి రాజ్యతంత్రములు కూడ విచారించుటమఱచి దివారాత్రములు మోహినిఁ గూడి కాలంబు పుచ్చుచుండె.ఇట్లుండఁ గొలఁది దినములకే కార్తిక శుద్ధైకాదశి యరుదెంచెను.అదియేకదా భగవంతుఁడగు విష్ణువు యోగనిద్రచాలించి జలంబులవిడిచివచ్చినపుణ్యదినము, దశమినాఁడుదయముననే తలవరులు "జనులారా ! నేఁడుదశమి.ఏకభుక్తము.రేపేకాదశి నిర్జలోపవాసము నుండీ" యని పట్టనమునఁ జాటింపఁ దొడఁగిరి.

మోహిని కడగంటిచూపులను పాశముల బద్ధుఁడై చిఱునవ్వులను సొక్కుమందుచే నొడలు తెలియక కృత్యము మఱచి యుండురాజు చెవిలోఁదలారుల వాక్యములుపడెను.భగవత్కటాక్షముచేఁ గర్మబంధమునెల్లఁ దెగఁగోసి స్వతంత్రుఁడైన యోగివలె రుక్మాంగదుండును.మోహిని కౌఁగిలి వీడఁదీసికొని పానుపు దిగివచ్చి యాకట్టువస్త్రములు విడిచి స్నానమొనర్చి మడుఁగుదోవతులుగట్టి శుచిప్రదేశమునఁ గూర్చుండి భగవంతు నారాయణు నేకాగ్రచిత్తముతోధ్యానించుచుండెను.మోహినియుఁ దలూలన శయనంబుడిగ్గ నుఱికి యూడినకోక ముడి యొకకేలను రైకముడి మఱియొక కేలనుబట్టి సగము జాఱినకొప్పుతో,సగముజాఱిన పైఁటతో,జిన్ని కెంపులతోడి మోవితో,సగమువాడిన మోముతో,నంచనడతో ఘల్లుఘల్లను నందెలరవళితో,రాజునుఁ జేరవచ్చి పద్మాసనాసీనుఁడైయున్న యతని తొడపైఁ దనమోకాఁలు మోపి యెడమచేయి యాయనమెడపైవైచి కుడిచేత మోము తనవంకకుఁ ద్రిప్పుకొనుచు ముసిముసినవ్వుల నిట్లనియె.

వల్లభా ! యిదియేమి ముట్టుతవలె దూరమునకూర్చుండితివి.నీవు కూర్చుండుటకు నాయూరుపీఠము లేదా యీదారుపీఠమేల ? నీవు కేలఁబట్టుటకు నామెడలోనిని ముత్తైపుఁ బేర్లులేవా? ఈకట్టెపూస లేల?నీవలం దుటకుఁ జందనము లేదా యీసుద్దమన్నేల !

అనిన రుక్మాంగదుఁ టిట్లనియె.ప్రేయసీ? నేఁడు దశమి.రేపేకాదశి,మఱునాఁడు ద్వాదశి,ఈమూఁడు దినములందును నేనుభోగము నాశింపరాదు,హరినామస్మరణము చేయుచుందును.నీవు నన్నీమూఁడుదినము లంటవలదు.దూరమున నుండుమ.ఇది నావ్రతము.

మోహిని-రాజా ! నీచరిత్రము చిత్రముగానున్నది.నీకు మతిస్వాతంత్ర్యము తొలగకున్న రతితంత్రము మానెదనందువా ? కపట మూని చెలిమికిని, సౌఖ్యముగోరుచు విద్యకును పరుష వ్రతుఁడై యంగనకు నాసపడ రాదనియెరుగవా?

కం. ఆమచ్చిక లాకలయిక
లామోహము లాప్రియంబు లాసౌఖ్యములుఞ
భూమీశ ! తలంపవలదో
నామీఁదిమమత్వ ముడగ నాయమె నీకుఞ

రాజు-ప్రేయసీ ! నీమీఁదిప్రేమఁ బాసినవాఁడ నని తలఁపకుము ఈమూఁడుదినములు సహింపుము. ఇది నావ్రతము.అల్పమైన దేహసౌఖ్యమును మరగి శాశ్వతమైన మోక్షసౌఖ్యము విడనాడరాదు.హరివాసరవ్రతము చాల శ్రేష్ఠమైనది.ఆవ్రతమాచరింపకుండినఁ బాపముకలదు.బుద్ధిమంతురాలవై నీవును నిట్రుపాసెముండి హరిని జింతింపుము దానివలన నీకు శ్రేయస్సుగలదు ఈసౌఖ్యములు సౌఖ్యములుగావు.వీనిన మరగి భగవచ్చింతన చేయనివాఁడు మతిమంతుఁడును కాఁడు.

చం. తలఁచినఁ జాలు శ్రీవిభునిఁ దామరసాక్షుని నాత్మలోపలన్ !
నిలిపినఁ జాలు నీలమణినీరదవర్ణుని నామవర్ణనల్ !
పలికినఁ జాలు శౌరిపదపంకరుహంబులు భక్తితోడుతఞ !
గొలిచినఁ జాలుఁజేకుఱనకుంఠిత సౌఖ్యములంబుజాననా !

మ. హరియే దైవము, శౌరిచెప్పినదియె యర్థంబు, ధర్మములు, శ్రీ !
ధరునింగూర్చి జపించునట్టిదియె మంత్రం బచ్యుతారాధనల్ !
చరియింపంగలదే వ్రతంబు కరిరక్షాశీలునానాకథా !
పరిపూర్ణంబగునట్టిదే చదువు, శంపాభాసురాలోకనా !

కం. హరిభక్తిఁ బోలుభ క్తి యు
హరిభక్తిఁ బోలుపుణ్యు లచ్యుతుఁ బోలన్
బరతత్వం బగుదైవము
హరినామముఁ బోలు మంత్ర మవనిం గలదే.

కావునఁ దలోదరీ ! నీవును శ్రద్ధాభక్తులు గలదానివై యీవ్రత మాచరింపుము.

మోహిని-తాఁజెడ్డక్రోఁతి వనమెల్లఁజెఱిచినట్టు నీవు చెడుటకాక నన్నుఁగూడఁ జెఱుపఁ జూచెదవా ? ఇంద్రుని బ్రహ్మహత్యను పంచుకొనుటవలన స్త్రీలను నెలకు మూఁడుదినములు దాఁకరాదు. అంతకంటెను ఘోరహత్య నీకు దాపరింపకుండినఁ బదు నేనుదినములకే మూఁడునాళ్లు నినుఁ దాకరాదందునా ? యథార్థ జ్ఞానము లేకుండుటే భ్రాంతి. నీవు విపరీతజ్ఞాని వగుటచే సుఖమును దుఃఖముగను,దుఃఖమును సుఖముగను, భావించుచున్నావు,నేనడిగెడు ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరమిమ్ము. నీవు రామరామ కృష్ణకృష్ణ యనుకొను నపుడు మనస్సునకు నిరతిశయానందము కలుగుచున్నదో లేక నాతోడ నర్మాలాపముల నిరతిశయానందము కలుగు చున్నదో చెప్పుము ఇప్పుడు నీవు మ్రాఁగన్ను పెట్టినాఁడవు కదా. ఇందు రతిపరవశుడవై యరగన్ను పెట్టినప్పటి సంతోషమున శతాంశమైనఁ గలదా ? ఆపాదములచూడుము నాయవయవములు నెల్లఁజూచినప్పటి సంతోషము నీసంకల్పిత మాయవిగ్రహముఁజూచుటచేఁ గలదా.

ఉ. ఎన్నిభవంబులం గలుగు నిక్షశరాపనయ సాయక వృథా !
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలములూఁది చూపులఁ !
విన్నదనంబు దోఁపఁగనువేఁదురనఁ బయి గాలిసోఁకినఁ !
వెన్నవలెంగరంగు నలివేణులఁ గౌఁగిటఁజేర్చుభాగ్యముల్ .

రాజా ! యానందమే బ్రహ్మము. అట్టి యానందము యుక్తకాలమున ననుభవింపనివానికంటె వ్యర్థజీవి మఱియొకఁడులేఁడు.

రాజు-కామినీ ! వ్రతములు నిష్ఠలు తపస్సులు కష్టతమము లనుట నిజమే. కాని సౌఖ్యకరములు కావను ట తప్పు. కొన్ని యప్పటికి సుఖముగాఁదోచును గాని మీఁద దుఃఖము కలిగించును. స్పర్శమువలనఁ గలుగుసుఖ ము లన్నియు శాశ్వాతములు గావు. అవి తప్పక మీఁదదుఃఖమును గలిగించును. కొన్ని తత్కాలమునఁ గష్టముగ నుండినను మీఁద దప్పక సుఖము గలిగించును. వ్రతము నిష్ఠలు తపస్సులు నీరకము లోజేరినవి. ఈయన్నిటిలో భక్తియోగము మిగుల మేలైనది భగవన్మూర్తిని ధ్యానించునపుడు జపించునపుడు నిశ్చలమైన మనస్సునఁ గలుగు నానందముతో విషయానంద మేనాఁటికిని నీడు గాదు. ఇది తెలిసియే మహానుభావులు నారదుఁడు పరాశరుఁడు పుండరీకుఁడు భీష్మార్జునులు వ్యాసాంబరీషులు శుకుఁడు గాల్బ్యుఁడు శౌనకుఁడు విభీషణుఁడు హనుమంతుడు ప్రహ్లాదుఁడు లోనై నవారందఱు భక్తి యోగముచేతనే ముక్తి కర్హులైరి. భక్తియోగమునఁ దత్కా లానందమే గాక చింతించుకొలఁది యమృతమైయుండును. మరణానంతరముశాశ్వాతసౌఖ్యము నిచ్చును. ప్రార బ్ధవశమున సంసారమను కూపమునఁ బడినవారు సర్వకాలసర్వావస్థల భగవత్సేవఁ జేయఁజాలనివారు యధాశక్తి నియమితకాలములందైన భగవంతుని ధ్యానింపవలయును. భక్తియనునది యెల్లవేళలఁ బండియుండు కల్ప వృక్షము భగవంతుఁడు భక్తిచే వశపడినట్టు మఱిదేనిచేతను వశపడఁడు. నేనును బూర్వజన్మకర్మవశమున రాజునైపుట్టినాడను. ఏవర్ణమందేయాశ్రమందెవఁ డుండునో వాఁడు దానిని జక్కఁగా నిర్వహించుట విధి. కావున రాజ్యపాలనము చేయుచున్నాను. సంసారిగానుండు కారణముచే సంసార విషయసుఖముల విడనాడ వలనుపడక భోగించుచున్నాను. భగవంతుఁడు రెండు కన్నులు రెండుచెవు లిచ్చినది యుభయలోకముల గమనించుట కనియునొకనోరే యొకబుద్ధియేయిచ్చులసత్యభాషణముచేతను వివేకము చేతను నొక్కటైన బ్రహ్మమును సాధించు నొక్కమార్గమందే వినియోగించుట కనియుఁ దెలియును. నీయందు కామాసక్తి యెంతదుర్భరమో నాకు ముక్తి కాంతాసక్తియు నంతనిర్భరమైయున్నది.

మోహిని-రాజా ! నీవు రెంటికిని జెడిన రేవణవు. త్రిశంకునివలె నుభయలోక భ్రష్టుఁడవు కాఁగలవు. సంసా రమందుండి యౌవనసుఖమైన ననుభవింపుము. లేక సంసారము రోసి కాంతార దుఃఖమైన ననుభవిం పుము యౌవనమో వనమో రెంట నొకటిగాని రెండిటఁ గడతేఱుదు ననువాఁడు మూఢుఁడు. నీగతి యెట్టులైన నగుఁగాక. నన్నుబుంఖాను పుంఖములుగశరపంపరలువైచి మన్మథుఁడు పీడించుచున్నాఁడు. రారారమ్ము. లేలేపొమ్ము. ఇఁకఁదాళఁ జాల.

అని పైబడి బిగ్గ కౌఁగిలించి ముద్దిడఁబోయిన "నన్నుదాఁకకుము. దూరమున నుండు మనిన వినవేమి? యని రాజు చేత నడ్డగించి ముఖమావలికిఁ ద్రిప్పుకొనెను.

మోహిని దన్నవమానింపఁబడిన దానిఁగా భావించి యెఱ్ఱకలువలవంటి కన్నులతో రాజును జుఱచుఱఁ జూచుచు నిట్లనియె.

ఓయీ ! నీవు నన్ను సర్వవిధముల నాశపఱిచితివి. నీచేత హత నైతిని. ఏమియెఱుఁగనిముగ్ధను నన్ను బేలుపుచ్చి యేమికోరినను దప్పక యిచ్చెదనని చెప్పియు నితర స్త్రీయందాసక్తి చేయననియు వాగ్దానముగా

వించినన్నుఁ దోడ్కొనివచ్చి యిప్పుడు ముక్తికాంతయును నొకదానిం దగులుకొని నాకోరికలు రిత్తపుచ్చి నన్ను మోసగించి నన్నన్ని విధములఁ జెఱిచితివి. నీవు సత్యవాది వని నమ్మితినిగాని ద్రోహివగుట యెఱుంగను. కల్లరి వై నన్నింత యవమానపఱిచినపిమ్మట నేను జీవించినా సరివారిలోఁ దలయెత్తి తిరుగుకంటె నిందేమరణించుట మేలు. ఇదిగో నీయెదుటనే నీఖడ్గము చేతనే శిరశ్ఛేదము చేసి కొనెదనని నేలఁబడితలమోఁదునుచు ఱొమ్మబాఁదుకొనుచు నేడ్చుచుండెను.

రాజును భ్రాంతచిత్తుఁడై దిగాలుపడి కొంతపడి యూరకుండి దానిని సమాధాన పఱచుచు నిట్లనియె.

భామినీ ! యేల యిట్లు తపించెదవు ? నీవేమి కోరినను దప్పక యిచ్చెద ననియు నన్యస్త్రీ సాంగత్యము చేయుననియు నీకుఁజెప్పినది వాస్తవము అవి తప్పను. ఇప్పటికైన నీవు కోరినది నే నీయ ననను. నిన్ను విడిచి నే నొకస్త్రీని గలయను. ప్రతి దినము రేయుంబగలునెఱవదిగడియలు నీతోడఁ గలసియుందునని నేను బ్రమాణము చేయలేదు. కావున నీవ్రతదినముల నీతోఁ గలయక పోవుటవలన నా సత్యమునకు హానిలేదు. కావున క్షమింపుము. నీయందుఁ బ్రీతిలేనివాఁడఁగాను. నేనొకఁ డను భ్రష్టుఁడ నైన లోకమంతయుఁ జెడును. అట్టికార్యము నేను జేయఁజాలను. ఓర్చుకొనుము.

మోహిని–నేనేమడిగిననిచ్చెద నంటివే యిచ్చెదవా ?

రాజు–ఈమూఁడుదినములు నీతోడిసాంగత్యము తప్ప మఱిదేనినైననిచ్చెదను

మోహిని–ఇచ్చెదవా ?

రాజు–మూఁటికి ముమ్మాటికి నిచ్చెదను.

మోహిని–అటైన నేకాదశి వ్రతమైనఁ జాలింపుము లేక నీకుమారునితల నీ చేతులార నీభార్యయెదుటఁ దెగ నఱకుము.

అనిన శలాకలతోఁ గ్రుమ్మినట్లు సీసముకరఁగించి చెవులఁ బోసినట్టు లీమాటలు వీనులఁబడఁగానే భూతము సోఁకినట్టు పిడుగడచినట్టు విహ్వలుఁడై నిశ్చేష్టుఁడై నేలఁద్రెళ్లి కొంత సేపటికిఁ దెప్పిఱిలేచి యాఁ డు పులిని జూచుజింకవలె మోహినినిజూచుచు రాజిట్లనియె.

ఓసీ! నీవు నన్నుఁ జంపఁబుట్టిన కొండచిలువవుగాని చెలువవు గావు. మినమిన మెఱయు సర్పవిషము కాంతినిగని బ్రమసి త్రావిన మూఢునివలె నేనును నీదేహకాంతిఁజూచి దోడితెచ్చితిని. మేలికులమునఁబుట్టి మంచిశీలములేని స్త్రీలసహవాసముఁ గోరుపురుషులగతియింతగాక మరియెంత యగు, పాపాత్మురాలా ! నీవంటి చెడికత్తెల వలననే కదా స్త్రీజాతి కంతయు నపకీర్తి వచ్చుట. పాపముచేయువారొకరు దానిఫలమనుభవించువారు పెక్కండ్రు. బ్రహ్మమానసపుత్రినని దేవతా స్త్రీ నని నీవు చెప్పుటచే నిన్ను విశ్వసించితిఁగాని పాలసముద్రములో విషముపుట్టినట్టు నీవు పుట్టితివని యూహింపఁజాలనైతిని. కామాంధునకు వివేక ముండునా. నీయిట్టిదానిని గనుటచేతనే బ్రహ్మకు లోకమునఁ బూజలేకపోయెను. దుష్టులారా ? నీకు నేనేమి కీడుచేసితిని ? వ్రతముచాలింపుమనిచెప్పి యుభయలోకభ్రష్టునిఁ జేయఁజూచెదవు. లేక లేక కలిగినకుమారుఁడొకఁడు. నావంశము నుద్ధరింపను నాసింహాసనమెక్కను, నాకు నివాసములు విడవను వాఁడుతప్ప వేఱొకఁడులేడు. అట్టివానిని జంపుమననీకు నో రెట్లాడె ? నీవు శాకినినో డాకినినో యీరూపున వచ్చితివిగాని నిక్కపు దేవతాస్త్రీవా ? నీవాఁడుదానవుగావున బ్రతికితివి. లేకున్న ముందు నిన్ను రెండుతుండెములుగ నఱికి పాఱనైవనా ?

మోహిని: ఓరీ! నీబిభీషకలకు బెదరుదాన నేనుగాను. ఈమాటలు చాలింపుము. నా సవతులకులోపడి నీవు నన్నవమాన పఱుచుటగాక బెదరించెదవా ? నీకు నేనేమి ద్రోహమెంచితిని ? నీయిచ్చకొలది నాతోడ సుఖింపుమంటినా మఱి యేదైనఁ గోరితినా ? భార్యాదాసుఁడవైన నీకదియే చేఁదయ్యెఁగదా ? వ్రత మనునెపముపెట్టి నన్ను నీవు వంచింపఁజూచెదవు. నాయెదుటనా నీవు టాటాలుగుణింపజొచ్చితివి. హాయిగా సుఖింతము రమ్ము. నిన్ను క్షమించెదను లేక టాటోటుమాట లాడెదవా నిన్ను విడువను. సత్యవాదివేని నేఁజెప్పినకార్యమైనఁ జేయుము. అంతియగాని నీయదరింపులు బెదరింపులు నాయెదుట సాగవు. దేవతా స్త్రీనయ్యు బ్రహ్మమానస పుత్రినయ్యు మానవమాత్రుని వరించితిననియే మావారు నన్ను దిసంతులు కొట్టుచున్నారు. ఇప్పుడిట్టియవమానముకూడనెట్లు సహింతును ? గోరుచుట్టుమీఁద రోఁకటిపోటా ?

ఈ వృత్తాంతమంతయుఁ బరిచారక లంతఃపురకాంతలకెఱింగించిన సంధ్యావళిలోనగు రాజభార్యలెల్లరు విన్ననిమోములతో నాదరబాదర నరుదెంచి దీనుఁడై యుండు భర్తను సివంగివలె రేఁగి పలికెడి గయ్యాళి మోహినినిజూచి వారిమాటలాలించిరి. అందు సంధ్యావళిమోహినింజూచి శాంతవాక్యముల నిట్లనియె.

చెల్లెలా ? నీభర్తను నీవిట్లు కస్తిపెట్టి బాధింపఁ దగదు. నీవేదడిగినను లేదనక కాదనక నీ కర్పించుచున్నాఁడు. తనప్రాణముకన్న నిన్నే యెక్కువగఁ జూచుకొనుచున్నాడు. అట్టిపతిని నిట్టులాడుట సతికిఁదగదు. నీవు పెద్దలసేవ

చేసేగాని కులస్త్రీలలోఁ గలసి తిరిగిగాని పుట్టినింటశిక్షితవైగానియున్నట్టుతోఁపదు. చిన్నప్పటినుండి యదరుబెదరు లేక స్వతంత్రించి పెరిఁగినమగువ లిట్టివారుగాక మఱియెట్టివారగుదురు. ఇది మనుష్యస్త్రీధర్మము. నీవు బ్రహ్మమానపుత్రివి. నీ వెఱుంగని దేమున్నది? దేవలోకమున మీరెట్టివారైనను మానవలోకమున నున్నపుడు మానవధర్మ మనుష్ఠింపవలయునుగదా. మీరు వంకరమార్గమునఁ బోయిన దేవతాస్త్రీలే యిట్టిదుశ్చేష్టలు చేసిరే మన మేల చేయరాదనిభూమియందలి స్త్రీలును జెడుదురు. నీవొకతె విట్టియా గడములు జేసిన స్త్రీలందఱిట్టివారేయను నపకీర్తి లోకమున వెలయును. కావునఁ బ్రాణేశ్వరునిబందిపెట్టకుము. ఆయనమాటకెదురాడకుము. నీకుఁ బ్రియమైనను నప్రియమైనను నీభర్త చెప్పినట్టు నడుచుట నీకువిధి. అటుకాదేని పాపములకుఁ బాలుపడుదువు. ఈవిషయమున నీకొకకథ చెప్పెద వినుము.

నేను బంఁడ్రెండేండ్ల దానవై యుండు నవసరమున నాజనకుని యాజ్ఞ చే నొకసేవకుఁడు కట్టెలు చీల్చుచుండ నాకట్టెలో నుండియొక పెద్దపురుగు వెలికి వచ్చెను. వాఁడు దానిని విసరియావలవై చెను. దానినిజంపఁగాకి యొకటి ముక్కుతోఁ బొడిచెను. నేనందుండినదాన నగుట దానిని జూచి యయ్యో పాపము దీనిని దేరకుఁ గాకులు చంపునే యని తటాలునఁబోయి కాకిని బాఱఁదోలి బాధపడుచున్న పురుగు నెత్తికొని దానిపైఁ గొంచెము చల్లనీళ్లు చల్లి పైఁటకొంగుతో మెల్లన విసరితిని. ఆకీటకము కొంచెము తెప్పిఱి నావంకఁజూచి మానవభాషణముల నిట్లనియె.

ఉ॥ ఓకరుణాకలాప : వికచోత్పలలోచన యిప్పు డియ్యెడ ౯ ।
గాకులు చంపకుండ ననుఁ గై కొని కాచిన నీకృపాగుణం ।
బేకరణి ౯ పచింపఁదగు ? నేఁ దొలిపుట్టువునందు భర్తపైఁ ।
గాఁక నొనర్చినట్టి ఘనకల్మమముల్ విను నీకుఁ దెల్పెదన్ ॥

తల్లీ ! కోపముచే భర్త నాపదల పాలుచేసితిని. దాననాకీజన్మము లభించెను. నావృత్తాంతముఁ జెప్పెదను వినుము. సముద్రతీరమున మాణిక్యపుర మను నగ్రహారము గలదు. అందు వేదవేదాంగవిదుఁడైన విష్ణుశర్మ యను బ్రాహ్మణుఁడు కలఁడు. ఆయన కొడుకు పద్మనాభుఁడు. ఆయననే నాభర్త ఆయనయుఁ దండ్రివలె సమస్త విద్యలు నేర్చినవాఁడే. అన్ని మంచిగుణములు కలవాఁడేయై నన్నాదరించుచుండెను గాని యదియేమి నాపాపమో కొన్నినాళ్లకు జారత్వముమరగి దుష్టస్త్రీలోలుఁడై క్రమక్రమముగ నాచారవ్యవహారము లననేల నన్నుఁగూడ మాని యింట నిమిషమైన నిలువక లంజెలయిండ్ల వెంటఁ దిరుగుచు జూదమాడుచు విటచక్రవర్తియై సంచరించుచుండెను. ఒక్కొక్కసారి రెండుమూఁడుదినము లింటికిఁ గూటికైనను వచ్చువాఁడు కాఁడు. చదువుసంధ్య జపము తపము అంతయు మాని జూదము, కోళ్లపందెము, పాముగరడీలు, వింటనేయుట, చెట్లెక్కుట, పిట్టలుపట్టుట, యిట్టి విద్యలం దారి దేఱి కిఱ్ఱుచెప్పులు, కోఱమీసము, ఓరకొప్పు, పాడుమొగముతో క్షుద్రస్నేహితులతోడఁ దిరుగుచుండెను. ఆబ్రాహ్మణున కగ్నిముఖత్వము పొగచుట్టలు కాల్చుటయందు సార్థకమయ్యెను. మద్యపానమే సోమపానమయ్యెను.

మ॥ ఇది పాపం, బిది లాఘవం, బిది కడున్ హీనంబు దుర్వర్తనం ।
బిది యన్యాయపుఁగీర్తనం, బిదికడున్ హేయంబిదే వంచనా ।
స్పద మజ్ఞానము లోకనింద యని యోజం గానఁ డొక్కింతయున్ ।
మదనోన్మర్త మనస్కుఁడై తిరుగునమ్మర్త్యుండు ధా త్రీస్థలిన్ ।

ఆయన యిట్టివాఁడైనను,

ద॥ నిలయము చక్కఁగా సలికి నిచ్చలు ముగ్గులు దీర్తు, నింటికిన్ ।
పతిదైవం బేదుగడయుఁ బతిసతులకు న
ప్పతియు కడుమేర దప్పిన
గతి కులకాంతకులకు వేఱుకలదే చెపుమా.

ఈవిధముగ నతఁడు భ్రష్టుఁడై పిత్రార్జితమైన ధనమంతయు కుంచన్న కూఁడబెట్టిన మంచన్నమాయము చేసినట్టు లంజెలకు లంజెవారి తమ్ములకు లంజెతల్లులకు జూదగాండ్రకుఁ గోడిపందెములకు వెచ్చించెను. అంతలో నిలువక యప్పులుతీసెను. ఎప్పటికై న నప్పు ముప్పే కదా ? కాసువీసము లెల్ల వెచ్చమయి బికారియగుట చూచి యప్పు లిచ్చినవారు మాసొమ్ము మాకిమ్మని పీడింపఁజొచ్చిరి. వారు పెట్టుబాధలుతాళజాలక వారి నెల్ల నింటికిఁ దోడ్కొని వచ్చి నామగఁడు వెలవెలఁ బోవు మొగముతో నన్నుఁజూచి యిట్లనియె.

ఉ. "కట్టిరి, కొట్టి, రీడ్చి, రధికంబుగ లాగిరి, గుండు ఱొమ్మునన్
బెట్టిరి, చెంగి ద్రోచిరి, తపింపఁగ నెండల నిల్పి రంటఁగా

జుట్టిన పచ్చడంబు వడిc జూఱcగc దోcచిరి,పట్టుకారులన్
బట్టిరి నిట్రుపాసెములపాలుగc జేసిరి వీరలండఱున్."

వీరు నన్నుc బెట్టుబాధలు నేనేమి చెప్పుదును.మాయప్పుచెల్లింపుమని నన్ను ముప్పది త్రిప్పులcబెట్టి మూcడు చెఱువుల నీరు ద్రాగిచుచున్నారు.వీరలు ముండ్లుగ్రుచ్చుటచే నాగ్రేళ్ల గోళ్లెట్లు వాcచియున్నవో చూడుము. నావీcపుమీcది కొఱడా దెబ్బల గాయములు చూడుము.వీరు నన్ను కన్నహింసలc బెట్టు చున్నారు.ఇప్పుడు నీవే నాకుగతి.నీసొమ్ములవీరికిచ్చి నాయప్పులుతీర్చి నన్ను రక్షింపుము.ఇcకమీదట నిట్టి దుశ్చేష్టలc జేయను.చేసిన పాపముఫల మనుభవించుచున్నాను.బుద్ధివచ్చినది.నాకుcదల్లివైనను, నీయెడ నేను జాల నపరాధము చేసితిని. క్షమింపుము.ఇcక నట్లుచేయను.నిన్ను వీడను.జూదమాడను.లంజెలc గూడను అప్పులు దీయను.నీకుcగీడు చేయను.నామాట నమ్ముము.ఇప్పుడు నాకీముప్పు దప్పించిన నీకింతకు రెట్టింపుగ సొమ్ములుచేయించి యిచ్చెదను. మగcడు పతితుడైనను మగువ యతని రక్షింపవలయును.అట్టి సామర్థ్యము స్త్రీలయందుcగలదు.నీవు గుణ వంతురాలవని యెఱుcగుదును.

కం॥ పతి కిహపరసౌఖ్యంబుల
కతిశయదుఃఖము లణంప నాపత్సంప
త్ప్రతతులకు నెల్లకాలము
సతియ కదా కారణంబు చర్చింపంగన్.

కం॥ విడువఁ దగుగతిcజరించిన
విడువంగా రాదు ప్రాణవిభుc గులసతికిన్
బడcతికిc బతిభక్తి గదా
తొడివాయcగc జన్నె వికచతోయజనేత్రా.

అని యెంతయో నన్ను వేcడుకొనెను.

నేను ఱాతిగుండెదానను ధనాశగలదానను నగుటచేతను,చేతనున్న సొమ్ముపోయిన బ్రతుకు మార్గము పోవునను భీతిచేతను బాపభయము విడిచి తాను గష్టపడియైనc బతిని సుఖపెట్టవలయు ననుజ్ఞానము లేనిదానవై మువ్వంకద్రిప్పి యతనితో నపు డౌడుగొట్టి నిట్లంటిని.

అయ్యా నామగcడు మీరా ? మీరు పెండ్లాము ముఖముcజూచి యెన్ని యుగములాయెను ? ఇల్లువాకిలి పెండ్లామనునవి నేcటికైన మనస్సునకు వచ్చినవా ? అంతేచాలును.ధన్యురాలను.తాతదండ్రులనాcటియార్జిత మంతయు ముండల పాలు చేసినది చాలక కొంప సమూలము లంజెలకూడ్చి పెట్టినదిగాక యిప్పుడు ముత్తైదువు పోణిమిగ నేవో నొడలి మీcదc బచ్చగానుండిన నీకన్ను లవి చూడcజాలవు కాcబోలు నిప్పు డీవేష మువేసితిని.నీవుబుద్ధిమాలినవాcడవు కావునc దొత్తుల యిచ్చకములకు బోలుపోయి భ్రష్టుcడవైతివి.నేను నీయట్టిదాన నని యే తలcచితివా ? ఇcక జూద మాడc డcట! కల్లుత్రాగcడcట ! నన్ను వీడcడcట ! ఏమినీతి! యేమినీతి !పుస్తెకట్టుకొని నీకొంపకు నేను వచ్చినది మొదలు నీవు యౌవనము ధనము వాడవదినెలపాలు చేసి తివికాని యొకనాcడైనc గన్నార నన్ను ననురాగదృష్టిc జూచితివా ?నో రారc బిలిచి యొక ప్రియమైన మాటc జెప్పితివా ? చేయార నొక పండో కాయో యిదిగోc దీసికొమ్మని నాచేతc బెట్టితివా ? మనసార నొక నాcడైన నన్నుc గలసితివా ? వెనుక ముందర నెవ్వరు లేని దాన నని యేనాcడైన స్మరించితివా ? అయ్యో పాపమనియైన నంటివా ? ఇంటిలోc బగలెల్లc గన్నకష్టములుపడి పనులుచేసి రాత్రి నీయాజ్ఞ ప్రకారము కాళ్లు పిసుకుచుండిన నెంతసేపై నను బెల్లముగొట్టిన రాతివలె నుంటివిగాని చాలునని యొక మాటచెప్పను నీకు మనస్సు రాదాయc గదా? నే నింట నెంతశ్రమించు నదియు నీకుc దోc పదాయెగదా? లంకవంటి యింతయింటిలో నే నొంటిగcబడియుండ నొకనాcడైన భయపడవలదని ధైర్యము చెప్పితివా ? ఋతుకాలముల నొక పూcట యైన నీవు సార్థకపతిచితివా ? వివాహకాలమున నీవుచేసినప్రమాణము నెన్నcడైనc దలంచితివా? పాపజాతీ ! నీ వెక్కడిమగcడవు ? నేనెక్కడి పెండ్లామనురా ? బవిసిమాలినవాcడా ? యేమని నా సొమ్ములడుగ వచ్చితిని ? నీకొంపలో నాకుc గన్నీటికూడే కాని కడుపారc గూడున్నదా ? ఏనాcడైన నొకరూక కొక రవికగుడ్డ యైన నిచ్చియుందువా ? ఔరా నాబంగారు మగcడా.

నీవు భర్తవని నేను భార్యనని యనినందుకు నీవేమి నాకుcగాc జేసితివి ? నాకిప్పుడు పతివ్రతాధర్మము పదేశింప నేముఖము పెట్టుకొనివచ్చితివి ? నేను నీకుc జేసిన హితోపదేశ మేమాత్రము వింటివి ? చెడెదవు చెడెదవని చిలుకకుc జెప్పినట్టు చెవుల నిల్లుకట్టుకొని చెప్పితిని.నామాట తుంగులో త్రొక్కితివికదా.నానీతులు చూరులోc జెక్కితివికదా ? నా వేcడికోలునకుc బెడచెవి నిచ్చితివిగదా? ఇవేనాసొమ్ములు.ప్రీతిగలమగcడా !

వీనిలో నివిచ్చినది నల్లపూసల సరమైన నున్న దేమో వెదకి తీసికొనుము జారులకూఁతలు.చోరులకూఁతలు త్రాగుఁబోతుల కూఁతలు నెవ్వరు నమ్మెదురు ? నేను జెవ్వాకుఁగూడ నిచ్చుదానఁ గాను.ఉన్నదంతయు దోఁచి యెవ తెకుఁబెట్టితివో దాని నడుగుము.అని నాపాదములకపై(వ్రాల్చిన యతనిశిరస్సు నావలద్రోచి మెకటి లు విఱిచి ఛీ పొమ్మంటిని.

ఇల్లు దయాదాక్షిణ్యములు లేక పూజకొలఁది పురుషుఁడు దానముకొలఁది బిడ్డలనుట మఱచి నేను దెగనాడుటయు నప్పులవా రతనిని నానావిధముల బాధించుచుఁ గొని పోయిరి.ఆరాత్రియతం డెట్లో వారిచెఱ నుండి తప్పించుకొని సముద్రతీరమునకుఁబోయెను.అప్పుడు కొందఱోడబేరగాండ్రుపయనమై పోవుచుండిరి.వారి యనుమతి పడసి యతఁడు నా యోడలోనెక్కిపోయెను.ఇట్లు కొన్నిదినములు పోవ నొకనాఁడు సముద్రమధ్యమున మహావాయువు వీఁపదొడఁగెను.అప్పుడు మాలిమికాండ్రోడకు నపాయము కలుగునని భయపడి దాని నొక పర్వత ప్రాంతమున నిలిపి యచట లంగరువేసిరి.అచ్చట రెండుమూఁడు దినములుండవలసివచ్చెను.

అప్పుడు నాభర్త యాఁకలిచే మాఁడుచు నూరకయీనావలోఁ బడియుండనేలయని యాకలమును డిగి కొండమీఁదికిఁ బోయి యెందైన ఫలములో నీళ్లో దొరకునా యని సంచారము చేయుచుండెను.

అప్పు డతని పూర్వపుణ్యము ఫలించెనో యన్నట్లు ఫలించిన చూతవనముగోచరించెను. అతఁడాతోఁ పు చేరబోయి వలసినన్ని మామిడిపండ్లు భక్షించి కమ్మనినీరు ద్రావి సేదదేఱనొకచెట్టుక్రిందఁ గూర్చుండెను.చల్లని గాలి వీచుచుండెను.అలసియున్నవాఁడు కావున సందేపడి హాయిగ నిద్రించెను.

అట్లతఁడు నిద్రపోవుచుండ నచ్చోటికి నొకదైత్యసుందరియే తెంచి యతని నిద్రమేల్కొలిపెను.పద్మనాభుఁ డును దనయెదుట నిలఁబడిన యాసుందరినిజూచి నీ వెవ్వతెవు? నన్నేల నిద్రలేపితివి ? నాతోడనీకేమి కార్యము గలదు ?

అనియడిగిన నది యిట్లనియె.చల్లకువచ్చి ముంతదాఁపనేల? నా చరిత్రమును,నీవలన నాకుఁ గాఁ గల ప్రయోజనమును చెప్పెదవినుము.ఇక్కడికి కొంతదూరమున నొక గుహయందు తారకుఁ డనుదానవుఁ డు గలడు.వాడు మహాపాపాత్ముఁడై యనేకము లకార్యములు చేయుచుండును.వాండెందఱిహింసించెనో లెక్కయే లేదు.వానిచేఁతలు నాకురుచింపకున్నను వానిభార్యనగుట నే నెట్లెట్లో వానినెల్లసహించియుందును.నాపేరు సుకేశిని.

ఇప్పు డాతారకుఁడు నాలుగు దినములనాఁడు కాశిరాజుకూఁతురు పద్మిని యను కన్య రాత్రి మేడపై నిద్రించుచుండ మంచముతోడనే యెత్తికొనివచ్చిదానిసౌందర్యమున కోటుపడిదానినిగామించి తనభార్యగమ్మని దానిని వేఁడుకొనుచున్నాడు."నీవునాభార్యవుగమ్ము నీకు సకలవిధ సుఖములు గలిగించెదను.నాభార్యచే నీకూ డిగముచేయించెదను.నీబంటనై నీవుచెప్పిన కార్యములెల్లఁ జెసెదను.నీమాట జవదాఁటను" అని దానిని బ్రార్థించు చున్నాఁడు.

దానికి దాసుఁడై వాఁడు నావంక చూడఁడు.నాతోమాటలాడఁడు.ముందు వచ్చినచెవులకంటె వెనుకవచ్చినకొమ్ములు వాఁడిగదా.కావున దానికి నిచ్చకములు పలుకుచు దాసుఁడై చరించుటచే నేనాయపమా నము పడఁజాలక యిల్లువిడిచి బయలు దేఱి వచ్చితిని.

మానవతి యేదుఃఖము నైనసహించును గాని భర్త పరసతీలోలుఁడై తన్నవ మాన దృష్టిఁజూచిన దుఃఖము సహింపఁ జాలదు.

కం.'ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నొర్వఁగనచ్చు మగఁ డింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటటు చెపుమా.'

కం. "మానంబె తొడవు సతులకు
మానమెప్రాణాధికంబు మాన మఖిలస
న్మానముల కుమూలం బగు
మానరహితమైన బ్రతుకు మానిని కేలా."

నాయదృష్టమున నిన్నుఁ గంటిని.వాఁడు ధరించువిల్లునమ్ములివె. వీనిని గైకొనివానిని వధింపుము.నేను నీకు భార్యనయ్యెదను.నేను గామరూపము ధరింప శక్తిగలదానను.కోరిన సీమలకు నిన్నుఁగొనిపోయికోరికలు కొనసాగ నిన్ను సుఖపెట్టనేర్తు.నామాట నమ్ముము.

అనిన నతం డిట్లనియె "ఓసి నీవాఁడుదానవు.అందుదానవివి.నిన్ను నమ్మఁజాల,నాకిట్టి దుస్థితివచ్చు

టకు స్త్రీలేకారణము. స్త్రీలోలుండనై యిల్లు వాకిలి భార్య సమస్తమువిడిచి యిట్లు గుట్టలవెంట నల్లాడుచున్నాఁడ. మరల నట్టి కార్యమే నే నెట్లుచేయుదును.

ఉ. నీతలఁ పెట్లెఱుంగ నగు నీరజనేత్రలు మాయజోగినుల్ ।
పాతక లుగ్రకోపలు కృపారహితల్ కపటస్వరూపిణుల్ ।
వీత భయల్ మహోద్ధతలు విత్తవినాశిను లన్వయచ్యుతల్ ।
చేతనహారిణుల్ కఠినచిత్తులు చౌర్యరతిక్రియాన్వితల్.

కుచభారమా గురువు. ముఖమా చంద్రుఁడు. పాపములా శనైశ్చరములు. ఇట్లు గ్రహరూపముగనున్న స్త్రీ నెవ్వఁడాసించి సుఖపడును ? స్త్రీలకు వాక్కులయం దమృతము. హృదయమున విషము.

తే. "తథ్యము వచింతు పక్షపాతంబు గాదు
నిఖిలజగములయం దిది నిక్కువంబు
తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు
వారలే కష్టముల కెల్లఁ గారణములు"

కావున నీతోడి తగులము నేనొల్ల ననిన నాదానవి యిట్లనియె.

" ఓయీనీవిట్లనకుము నిన్ను నేను మోసగింపను. నిజముగనీయందుఁబ్రీతిగలిగి చెప్పుచున్నాను. స్త్రీతాను వలచినవానిని జెఱుపదు. దుష్టస్త్రీలు తన్ను వలచినవారిని జెఱుతురు. నే నట్టిదానఁగాను, నేను నీకు ద్రోహము చేసితినేని కన్యల విక్రయించి ధనము పుచ్చుకొని వివాహము చేసి యిచ్చినవారి గతికి, కృతఘ్నులగతికి, ఇంట్టి దొంగలగతికి, సాధువుపై నిందమోపినవారిగతికి, సారాయము మాంసము భక్షించు బ్రాహ్మణునిగతికిఁ బోవంగలదానను. వీఁడునన్నుఁ బరిణయమునఁ గైకొనినభర్తగాఁడు. బలత్కారముచే నన్నుఁ జెఱిచెను. వేఱుగతి లేక వీనికిల్లాలనై యున్నదానను. ఇట్టివానిని జంపుట చంపించుట దోషావహముగాదు. కుటిలబుద్ధులను గుటిలబుద్ధి చేతనే గెలువవలయును. వారియెడ చక్కటి నడవడి కొఱగాదు." అని విల్లునమ్ములిచ్చిన నతఁడు నుత్సాహంబు గొని దానవుని దుని మెదను భయపడకుమని యల్లెత్రాడుమ్రోయించిన యాధనుష్టంకారంబు విని తారకుఁడు రోషపరవశుఁడై సింహమున్న గుహలోనికినేనుఁగు వచ్చి విజృంభించుచున్నదని రేఁగి పద్మినిని బాన్పునందపడియుండఁగట్టివైచి హుటాహుటి నరుదెంచి తన భార్య సమీపమున నుండునా బ్రాహ్మణునిజూచి యోరీనీవెవ్వఁడవు? ఇందుల కేలవచ్చితివి ? నాభార్య నేల యిటకుఁ దెచ్చితివి ? వచ్చితిని తెచ్చితివిగాన చచ్చితివని యనిన నతఁడిట్లనియె.

ఓరీ పాపాత్ముఁడా ! నేను నీపాలిటి మృత్యువను. నిన్నుఁ జంపుటకై సాధురక్షణార్థమైవచ్చిన బ్రాహ్మణుఁడను పర స్త్రీలను నీవు బలత్కారముగఁ దెచ్చినపుడు నీస్త్రీని నేనేల తేరాదు ? ఇఁకమాటలతోఁ బనిలేదు. కయ్యమునకు రారమ్మని పదునుగల ములుకుల వానిపైఁ గురియించి మేనల్ల నొంచిన నతఁడును గనలి వంటయింటి కుందేలు నీ వెందుఁబోఁగలవు. దేవుఁడు నామీఁదఁ గరుణించి యాహారము నాకింటికే తెచ్చి యిచ్చెనని చేతిశూలమున నతనిఁ బొడువఁబోవ బద్మనాభుఁడును తాటితన్నువారితలఁ దన్ను వారు లోకమున లేరని తలఁ చితివాయని కఱకు బాణములచే దానిని దునియ చేసి మఱియొక బాణమువింటసంధించి యాకర్ణాంతములాగి ఱొమ్ముగుఱిచూచి విడిచిన నది ఱొమ్మునాటి వీఁపునదూసి పోవ దానవుఁడపుడు మొదలంట నఱికిన పెను మ్రాఁకువలె దబాలున భూమి యద్రువఁ బడియెను.

వానిపాటుఁజూచి కేశని హర్షించి యతనిఁ గౌఁగిలించి యింటికిఁదోడ్కొనిపోయి పద్మినిని బంధములనుండి విడిపించి యామెకు ధైర్యముఁజెప్పి తా నొకహంసియైవారినిరవుర మోచి కొని కాశికివచ్చి రాజునంతఃపురంబున విడిచెను.

మరణించినది మరలజీవించినట్లు వచ్చిన తన పుత్రికంజూచి హర్షించి యారాజుసర్వవృత్తాంత మెఱిఁగి పద్మనాభునకామెనిచ్చి వివాహముఁగావించె. నాభర్తయుఁగొన్ని దినములంద యిరువురుభార్యలతో సుఖించుచుండ వలసిన వస్తువాహనాదులెల్ల రాజీయఁ గైకొని నేనున్న చోటికివచ్చినాతప్పులెల్ల మఱచి నన్నుఁదోడ్కొని తన గ్రామమునకుఁ బోయి మాముగ్వురతోడ సుఖించుచుండె.

అంతఁ గొంత కాలమున కతఁడు మృతుఁడయ్యెను. తరువాతఁ గొన్ని దినములు దుఃఖ మనుభవించి నేనును జచ్చి యమలోకమున కరిగితి. అందు నన్ను యమకింకరులు క్రాఁగునూనెలో నుడికించియు గండుకుక్కలచేఁ గఱపించియు నెఱ్ఱగఁ గ్రాగిన యినుప పెనములపైఁబొరలించియు నానావిధ నరకముల బాధపెట్టిరి. కడపట నీ పుర్వుజాతియందుఁ బుట్టఁజేసిరి. నాపూర్వపుణ్యవశమున నీకంటఁబడితిని. నీవొకనాఁడు మాఘస్నానము చేసినపుణ్యము నా కొసఁగితివేని నేను దరించెదను. ఇంతమాత్రము పుణ్యముకట్టుకొమ్మని

వేఁడిన నేనట్ల కావించితిని. వెంటనే యదియుఁ బురుగుమేను విడిచి దివ్యదేహముతో స్వర్గమునకుఁ బోయెను.

కావునఁ జెల్లెలా నీవు భర్తను నిర్బంధపఱుపకుము. నిష్ఠురము లాడకుము. అనిన నదియును నెయ్యిపోసిన మండు నగ్నివలె రేఁగి చేతులతో సంధ్యావళి మూతులు పొడుచుచు నోసినా దాసీ! నీ వెవ్వతెవే నాకీ నీతులు చెప్పను ? పిలువని పేరంటము చెప్పనియొక్క ప్రొద్దన్నట్టు నిన్నెవ్వరిందుఁ బిలిచిరే గయ్యాళీ! ఇచ్చకములాడి నామగనిని మచ్చికచేసికొన వచ్చితివా మిటారీ ! ఎద్దుబెదరిన గానుగ బెదురునా ? నీవురచ్చచేసి నంతమాత్రమున నేను భయపడుదునని తలఁచితివా ? తానఁట పెద్దపత్తివిత్తఁట ! నాకు బోధపఱుచునఁట ? నీవఁటే తాతకు దగ్గులునేర్పెదవు ? నీటక్కు డమారములు నాయెదుటనా ? అగ్రహారములోనా తమ్మళజోస్యములు ? నీ వెంతగయ్యాళివే ఎంత జగజంతవే, ఎంతధూర్తురాలవే రాకాసీ ! నేను నామగఁడు సరసములాడుకొనుచుండ ని న్నెవ్వరే పానకములోని పుల్లవలె నడ్డమురమ్మనిరి. అని కనుబొమ్మ లెగయుచుండ పెదవులు కదలుచుండ రాజువంకఁ జూచి యిట్లనియె.

రాజా యాఁడుదానికి బుద్ధి పెడతలనుండునను సామెత నాయందు నిజమయ్యె రాజుల నమ్మరాదను మాట యెఱిఁగి నీ మాయవలలకుఁ జిక్కితిని బుద్ధి కర్మానుసారిణిగదా ! నీవు దబ్బరకాఁడవని యింతటి స్త్రీలోలుఁడవనినాకుమున్ను తోఁచి నదికాదు. క్రొత్తయొకవింత ప్రాఁత యొకరోఁత యన్నట్లు నీ యక్కఱ తీరఁగానే నెపములు పెట్టి నన్ను వెడలగొట్టఁదలఁచి నీ పెండ్లాలకు దాసుఁడవై వారిచేత నన్నుఁదిట్టింపఁ జొచ్చితివి. నీనేస్తము చాలుఁజాలు. ఇప్పుడు నేను వగచుట గతజల సేతుబంధము. అయిన నేమాయె. నాకొక్కమాట చెప్పుము. వ్రతము విడిచెదవా ? నీపుత్రు నఱకెదవా ? అసత్యమాడితి ననెదవా ? నన్నింటికూటికిఁ ద్రోవకూటికిఁగూడఁ దప్పింపకుము. నీ వింతటి వ్రతనిష్ఠుఁడవని చెప్పియుండిన నీ మొగమైన నేను జూచి యుందునా? లోకముతో పాటు సుఖపడఁగోరి వచ్చితినిగాని నీ యింటఁ బస్తులు చావ వచ్చితివా ?వయస్సు ప్రవాహము వంటిది పోయినదినము మరలరాదు. అట్లుండ నుపవాసములని వ్రతములని పర్వములని శ్రాద్ధములని దినములు త్రోచుచుండిన నిఁక సుఖించుటెప్పుడు ? కూడు నీళ్లు మాని దేహము నెండఁబెట్టి పరుగు చేసిన పిమ్మట జనసత్త్వములుడుగఁగా సుఖించుటెట్లు ? అన్ని ధర్మములకు శరీరము గదా ప్రధానము దానిని శుష్కింపఁ జేసినతరువాత నీవేకార్యము లెట్లు చేయఁగలవు ?మతిమాలినవాఁడవై వెఱ్ఱిపోకలంబోక లేచిరమ్ము. పడుకటింటికిఁబోయి సుఖింతము" అనినరాజేమియుఁ జెప్పఁజాలకదిగ్భ్రమగొని యూరకుండెను.

సంధ్యావళి రాజు విన్నఁదనమును మోహిని దుడుసుఁదనమునుజూచి దానితో నిట్లనియె, ఓసీ! గుడిలోనుండి గుడిఱాలుత్రోయుట నీయందు నిక్కమయ్యెను. తిన్న యింటి వాసాలు లెక్కించినట్లు ఇంటనుండి యింటి యజమానుని సొమ్ము దొంగిఁ లించినట్లునీవు మాయింటఁజేరి మాయిల్లే సమూలము చెఱుపఁ జూచెదవా? గొడ్రా లే మెఱుఁగును బిడ్డకుట్లన్నట్లు నీవు గొడ్రాలవు కావున మాపుత్రుని జంపుమన నోరాడెను. చెఱకు తీపని వేళ్లతో నములుదురా ? కఠినమేది ? స్త్రీహృదయము. కఠినమేది ? స్త్రీహృదయము. కఠినతరమేది ?గొడ్రాలిహృదయ మనుసామెత నీయందు నిక్కమయ్యె. నీయందుఁ గామాసక్తితప్ప ధర్మాసక్తి రవంతయుఁ గానరాదు. మగఁడక్రమప్రవర్తనము కలవాఁడైనను సరిదిద్ద వలసిన భారము భార్యయందుఁడ బతిని సక్రమవర్తనమునకై నిర్బంధించు నీయట్టిదానిముఖము చూచినఁ బాపము తప్పదు" అని రాజువంకఁజూచి యిట్లనియె.

ప్రాణేశ్వరా ! మీరిట్లు చిత్తవిభ్రమము గొనియుండరాదు. వాస్తవముగ నిది నీయందుఁ బ్రీతితో వచ్చినది కాదు. విశ్వామిత్రునకు రంభవలె నీవ్రతముఁ జెఱుప దేవతలు పంపవచ్చినదనియే నాయభిప్రాయము. అట్టుకాకున్న నిట్టు లేరట్టడి జంతయైన మాటలాడునా ? కావున నగునది కానిండు. ఈఁతకు మించినలోఁతు తలకు మించిన దండము లేదు. ఎటులైనఁగాని సత్యమును వ్రతమును మానకుఁడు" అనిన రాజు తెలివొంది మోహినితో నిట్లనియె.

ఉ. వేయిటికైన బొంకఁబదివేలకు నైన నసత్యమాడన ।
న్యాయముపల్క లక్షకయినన్ వనజాయతనేత్ర । యూరకే ।
రాయిడదిచేసి మాను మనరానివ్రతం బిది మానుమన్న నే ।
నీయెడ నెట్లుమానుదు ? నిదేమిటికింత చలంబు చెప్పుమా ?

సీ. రాజసూయాది సత్కృతు దీక్షలందైన
మగువ యేకాదశి మానరాదు
కళ్యాణకమనీయకాలంబులందైన
వనిత యేకాదశి వదలరాదు
పితృదేవతా సమంచిత పూజలందైన

వెలఁది యేకాదశి విడువరాదు
జాతసూతకమ్మృతసూతకంబులనైన
నువిద యేకాదశి నుడుగరాదు
తే. బాలురకు వృద్ధులకు గర్భభారవాహ
తరణులకు రోగులకు నౌషధక్రియాది
నిరతులకైన వర్జింప నీతిగాదు
సితకరానన యేకాదశీ వ్రతంబు.

అని వచించుసమయమున నీవృత్తాంతమంతయు వినిన ధర్మాంగదుఁడు వేవేగఁ దల్లిదండ్రు లుండుతావునకు వచ్చి వ్రతమైన మానుము సత్యమైన మానుము లేక పుత్రు శిరస్సు ఛేదింపుము అని నాపినతల్లి మోహినీదేవి కోరెనని వింటిని. ఇది నాయందలి పరమానుగ్రహ మనుకొంటిని. ఏకాదశీవ్రతమిహపరసాధకము. మోక్షకారణము. ఇఁక సత్యము సమస్త ధర్మములకు జనని. సమస్త ప్రపంచమునకు సత్యమే యాధారము. సూర్యచంద్రులను నడుపునది సత్యమే. కోటి యజ్ఞములును నాలుగువేదములును సత్యమున కెనగావు. సత్యహీనుఁడెన్ని జపములు తపములు యజ్ఞములు చేసినను నిష్ఫలములు. సత్యహీనుఁడు పెట్టు శ్రాద్ధములు పితరులు కెక్కవు. సత్యముచే సమస్తలోకములు జయింపవచ్చును.

ఉ॥ సత్యముఁబోలు ధర్మమును, శాంతముఁబోలు తపంబు,సాధుసాం
గత్యముఁబోలు లాభము, నగర్వముఁబోలు గుణంబు,సన్నుతా
పత్యముఁబోలు మోదము, కృపామతిఁ బోలఁగఁదీర్థమున్ బుధస్తు
త్యముబోలు భాగ్యము వసుంధరఁగల్గునె రాజశేఖరా !

కం॥ పాటకు సత్త్వము శ్రుతి, గడి
కోటకు సత్త్వంబు సమతఁ గొల్చెడిసైన్యం
బాటకు సత్త్వము తాళము
మాటకు సత్త్వమ్ము నిజము మనుజాధీశా.

ఆ॥ శమము లేనితపము,సతి లేనిసౌఖ్యంబు,
పతిహితంబు లేనిభటునిసేవ,
పాత్ర మెఱుఁగనీవి, పగఁ దీర్పంగా లేని
బలిమి, నిజము లేనిపలుకు లేల ?

కం॥ కులసతికి వన్నె మానము.
కలిమికి వితరణము వన్నె, కదనంబునకున్
దలఁకమియె వన్నె భటునకుఁ
బలుకునకు నిజంబు వన్నె పార్థివముఖ్యా.

అసత్యమాడుటకంటె ఘోరపాపము మఱొండులేదను సూక్తి మనము మఱవరాదు. తప్పక నశించుదేహమునకై తప్పక మహాఫలము నిచ్చు సత్యవ్రతముల విడువరాదు. గొప్ప పుణ్యము చేసినవారికిఁగాక యేకాదశిమృతి గలుగదు. అందు సత్యరక్షణార్థము దేహ మిచ్చుటకంటె ఘనకార్య మేదికలదు. తండ్రీ ! తుచ్ఛమైన యీపాంచ భౌతిక దేహమునకు మాఱుగశాశ్వతకీర్తిముక్తులు లభించుచుండ విచారమేల ?

కావునఁ గృతనిశ్చయుండవై నాశిరంబు దెగవ్రేయుము. అనీ ధీరుఁడై యెదుట నిలవఁబడియె.

ఇట్లు పరిశుద్ధమనస్కుఁడై తదేకధ్యాననిష్ఠుఁడై నారాయణ నామమంత్రంబు జపించుచుఁ గరములుమోడ్చి తూర్పుముఖంబుగఁ దిరిగి నిలువంబడినసుతునిఁజూని రుక్మాంగదుండు సుతుఁడును సంధ్యావళియుఁ బ్రేరింప ఖడ్గంబు కేలఁగొని జళిపించి పుత్రుశిరంబు ఖడింప గమకించి కరమెత్తుటయు మోహినియాముప్వర తెంపునకు విస్మయము భయము గదురఁ దటాలున రాజుచేతిని బట్టుకొని యిట్లనియె.

రాజా ! మిమ్ము ముగ్గురనొక్కచోఁటఁ జేర్చిన ముండ దైవమునకు మొగమాటము లేదు సుమా ! ఇంత వఱకు నీవు వివేకివని తలంచుచుంటిని. దుష్టురాలైన యత్తముండ కొడలినివలె, అర కాసుచేయని యుపవాములఁ గడుపు కాల్చి చంపుచు తాంబూలము వేసికొననీక, పూలు పెట్టుకొనీక, గంధము పూసుకోనీక, కన్నార నిద్రపోనీక యాలుమగలను సంతోషగన్నబిడ్డను,కులముద్ధరించు కొడుకును,ములికికై యిల్లు తగులబెట్టి నట్లునిష్కార ణముగ నొకనిఁజంపుటే మహాపాతకము. అందుఁ బుత్రునిజంపుట యెటువంటిదో నీవే యూహింపుము. ఆతండొక్కఁడేకాని వేఱుకొడుకు లేదు. మీరు చచ్చిననీళ్లు విడువవలసినవాఁడు వీఁడే. అట్టివీనినిమీరుచేతులారజంపి

